# బెజవాడ సరస్వతీ బుక్ డిపోవారి స్వంత ప్రచురణములు

## ఆంధ్రదేశమందు ప్రదర్శింపబడు నాటకరత్నములు

| | రు. | అ. |
|---|---|---|
| సతీ సక్కుబాయి సో॥ రా॥ | 0 | 12 |
| శ్రీకృష్ణతులాభారము ము॥ సు॥ | 1 | 0 |
| సత్యహరిశ్చంద్రీయము బ॥ లు॥ | 1 | 0 |
| బుద్ధిమతీ విలాసము డిటో | 1 | 0 |
| రంగూన్ రౌడి సో॥ రా॥ | 1 | 0 |
| ఫిరంగికోట డిటో | 1 | 0 |
| సతీ అనసూయ డిటో | 1 | 4 |
| గంగావతరణము డిటో | 1 | 0 |
| మహాభక్తివిజయము డిటో | 1 | 0 |
| ద్రౌపదీ వస్త్రాపహరణం ము॥ అ॥ | 1 | 0 |
| సావిత్రి చి॥ స॥ | 1 | 0 |
| చింతామణి కా॥ నా॥ | 1 | 0 |
| మధుసేవ డిటో | 1 | 0 |
| హరిశ్చంద్ర లేక అనసూయ స॥ అ॥ | 1 | 0 |
| రాధాకృష్ణ పా॥ లు॥ | 0 | 12 |
| పాదుకాపట్టాభిషేకము పా॥ లు॥ | 1 | 4 |
| జయంతీజయపాలము బ॥ స॥ | 0 | 12 |
| కృష్ణలీల ... కే॥ సు॥ | 1 | 4 |
| రామదాసు ధ॥ గో॥ | 1 | 0 |
| విప్రవిజయం కృ॥ య॥ | 1 | 0 |
| రాణాప్రతాపసింగు డిటో | 1 | 0 |
| చంద్రగుప్త బ॥ శి॥ | 1 | 0 |
| మున్నాదాసు బ॥ శి॥ | 1 | 4 |
| రాణాప్రతాపసింహ డిటో | 1 | 0 |
| రాధాకృష్ణ సాంగ్సు చ॥ కే॥ | 0 | 12 |
| తులాభారం సాంగ్సు డిటో | 0 | 12 |
| చండీనాటకం ము॥ వే॥ | 1 | 0 |

## ఆదిభట్ల నారాయణదాసుగారి హరికథలు

| | రు. | అ. |
|---|---|---|
| జానకీ శపథము | 1 | 0 |
| రుక్మిణీకల్యాణము | 0 | 12 |
| మార్కండేయ చరిత్రము | 0 | 12 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 12 |
| అంబరీష చరిత్రము | 0 | 8 |
| ప్రహ్లాద చరిత్రము | 0 | 8 |
| గజేంద్ర మోక్షము | 0 | 8 |
| భీష్మచరిత్రము | 0 | 8 |
| పైని వుదహరించిన 8 పుస్తకములు కలసిన క్యాలికో బయిండు. | 5 | 8 |

## పి. బాలాజీదాసుగారిచే రచియింపబడినహరికథలు

| | రు. | అ. |
|---|---|---|
| గయోపాఖ్యానం | 0 | 8 |
| జయప్రదాదేవి చరిత్ర | 0 | 8 |
| నలచరిత్రము | 0 | 8 |
| రుక్మాంగదచరిత్రము | 0 | 8 |
| కుశలవ విజయము | 0 | 8 |
| శశిరేఖాపరిణయము | 0 | 8 |
| సంగ్రహరామాయణము | 1 | 0 |
| దయాకర విజయము | 0 | 8 |
| త్రిశంకు విజయము | 0 | 8 |
| సీతాకల్యాణము | 0 | 8 |
| ద్రౌపదీ మానసంరక్షణం | 0 | 6 |
| కుచేలోపాఖ్యానం | 0 | 6 |
| పురందరదాసు చరిత్ర | 0 | 6 |
| హరిజనభక్తివిజయమంజరి పా 1 ... | 0 | 6 |
| డిటో రెండవభాగము | 0 | 6 |

మా వద్ద అనేకరకములు గలవు. కోరినవారికి మాదుపెజీల కెట్లాగు ఉచితముగా పంపబడును.

దొరకువారు:— కురికూరి సుబ్బారావు, ప్రొప్రయిటరు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.




సంపుటము ౭ రాజమహేంద్రవరము ౧౫ జనవరి ౧౯౩౬ ౧ వ సంచిక

# నిగళ బంధనం

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు

మొదటిరంగం

మహామంత్రి తిమ్మరుసయ్యంగారి యిల్లు. లోపలి వసారాలో, తిమ్మరుసు, కుర్చీమీద కూచుని వుంటాడు. అతని భార్య, లక్ష్మమ్మ, కొంచెం పక్కగా నుంచుని వుంటుంది.

తిమ్మరుసు—ఇంకేం లాభం లక్ష్మీ? అంతా అయిపోయింది. అదొక స్వప్నం. అదొక కట్టుకథ అనుకో.

లక్ష్మమ్మ—మీ కేం, చెబుతారు. మనస్సులో నాటుకోడమే వస్తే ఆడది యిక మరిచిపోలేదు. కృష్ణ డెదురుపడితే మీ కెలా వుండేదో కాని ప్రాజ్ఞత వచ్చిన కొడుకుని చూస్తే యెలా వుంటుందో అలా వుండేది నాకు. అతను, యెదటికి—దగ్గిరికి వచ్చి "అమ్మగారూ" అనేటప్పటికి నాకు వొళ్లు గరిపొడిచేసేది. "ఇతగాణ్ణి నా కడుపున యెందుకు పుట్టించాడు కాదూ?" అని ఈశ్వరుడిమీద నాకు కోపంగా వుండేది.

తిమ్మరుసు—సందేహమా? నాకు కూడా కుడిభుజం పడిపోయింది.

లక్ష్మమ్మ—మీచేతిని మీరే నరుక్కున్నారు. తెలుసునా?

తిమ్మరుసు—కొంతవర కలాగే. ఏం చెయ్యగలను? రాజాజ్ఞ అలా వుంది. ఈశ్వరాజ్ఞ నేనా జవదాట వచ్చు గాని రాజాజ్ఞ నతిక్రమించడమే? రాజసేవ నిజంగా పాములతో చెలగాటమూ, కత్తులమీద సామూనూ. ఏమాత్రం హెచ్చూ, తక్కువా వచ్చినా బుర్ర లెగిరిపోతాయి.

లక్ష్మమ్మ—లోకాన్ని కిదో కనచం దొరికింది. అయినా, మహారాజు కృష్ణుణ్ణి కడతేర్చ మనడంలో—(అర్థోక్తి)

తిమ్మరుసు—కడతేర్చ మని కాదు రాజాజ్ఞ. కళ్ళు పీకించ మనీ.

లక్ష్మమ్మ—కృష్ణుడు జీవచ్ఛవం అయిపోవా లనీ. కదుటండీ?......అయితే: రాజాజ్ఞకంటె యెక్కువ పనే చేశారు మీరు. అవునా?

తిమ్మరుసు—అది కృష్ణుని కోరిక.

లక్ష్మమ్మ—పోనీ, ఆవివరా లేనా చెబుతారా?

తిమ్మరుసు—చెప్పడాని కేం వుందీ? రాజాజ్ఞ అనేటప్పటికి గుడ్లు పీకేశాడు తలారి. తరవాత, ఆ బాధ సహించలేకా, యిక బతికివుంటే మాత్రం లాభం యేమిటనీ, బతికివున్నంతకాలమూ తల్లి నేడ్పించడం మంచిది కాదనీ (అర్థోక్తి)

లక్ష్మమ్మ—ఇది సంతోషపెట్టడం కాబోలు.

తిమ్మరుసు—ఒక విధంగా అలాగే చెప్పవచ్చు. కుంతి అయినా, గుడ్డి అయినా కొడుకు—అందులోనూ యేకపుత్రుడు బతికివుండడం తల్లికి సంబరమే; కాని యిది సామాన్యసంసారుల సంగతి.

లక్ష్మమ్మ—నాగమ్మగారి బతుకు అంతకంటే అధ్వాన్నం చేశారు మీరు.

తిమ్మరుసు—ఎంతచెట్టుకి అంతగాలి కదూ? నేలమీద వున్నవాడు పడితే దెబ్బా తగలదు, స్థితీ మారదూ. కొండమీద వున్నవాడు పడ్డాడంటే మాత్రం తుక్కుతుక్కయిపోతాడు.

లక్ష్మమ్మ—మనకి ధర్మసూత్రాలకు లోటేమిటి లెండి. తరవాత యేం జరిగిందో చెప్పండి.

తిమ్మరుసు—మరి అద్భుతగలకు. కాని నువ్వు వినడం మాత్రం మంచిది కాదు.

లక్ష్మమ్మ—ఎంచేతో?

తిమ్మరుసు—నీగుండె బేజా రయిపోతుంది.

లక్ష్మమ్మ—మీగుండె రాయిచేసుకున్నారు. నా గుండె వజ్రమే అయిపోయింది. ఫరవా లేదు చెప్పండి.

తిమ్మరుసు—అవునవును. "సమ్రాజ దశి కర్ణోరాణి" కదూ? మరి విను. బతికి వున్నంతకాలమూ తల్లి నేడ్పించడం మంచిది కాదనీ "అది రాజాజ్ఞ అయితే యిది నాకోరిక. తల కొట్టించివెయ్యండి" అన్నాడు కృష్ణుడు.

లక్ష్మమ్మ—ఆపళంగా, ఆపనిమాత్రం, మీచేత్తోటే చేశారు. కాదు టండీ?

తిమ్మరుసు—నీకు తెలవని దేం వుంది?

లక్ష్మమ్మ—నిజం చెప్పండి. స్వయంగా—(తిమ్మరుసు కుడిచెయ్యి చూపిస్తూ) ఈవుక్కుచేత్తో—(అర్ధోక్తి)

తిమ్మరుసు—"కర్తా, కారయితా—" కదూ? స్వయంగానే అని చెప్పవచ్చు.

లక్ష్మమ్మ—గుండెలు కొట్టుకుంటున్నాయి. శరీరం జలదరిస్తోంది......అయితే: రాజాజ్ఞ నిర్వహించడానికి వెళ్లడానికి ముందు మీ రోమాటు యింటికి రావలసింది.

తిమ్మరుసు—ఎందుకూ?

లక్ష్మమ్మ—కృష్ణుడు నాగమ్మగారి కొడుకు కాదు, నాకొడుకు.

తిమ్మరుసు—అయితే?

లక్ష్మమ్మ—కత్తై డయితే ముందు నన్ను నరికివేసి, కృష్ణుణ్ణి తరవాత కడతేరిస్తే మీ కింకా కీర్తి కదూ?

తిమ్మరుసు—(కిందికి చూస్తూ వూరుకుంటాడు)

లక్ష్మమ్మ—నిర్దోషినీ, అమాయికుణ్ణీ సంహారించడంలో మీరు చాలా రాజభక్తి కనపరిచా రండీ" (అతి కష్టంమీద దుఃఖం సమాళించుకుంటుంది)

తిమ్మరుసు—లక్ష్మీ!

లక్ష్మమ్మ—(పలకదు.)

తిమ్మరుసు—లక్ష్మీ!

లక్ష్మమ్మ—ఇంకా వుందా యేమిటి చెప్పవలసింది?

తిమ్మరుసు—ఒక్క అక్షర మేనా లేదు; కాని, చూడూ. ఆవేశం తెచ్చుకోకు. శివుడి ఆజ్ఞ లేనిదే చీమ అయినా కుట్టదు.

లక్ష్మమ్మ—(గద్గదికతో) ఒక్కొక్కప్పుడు "దేవుడున్నాడా" అనిపిస్తూ వుంటుంది.......కాకపోయినా యిది యీశ్వరలీల అని చెప్పుకుని వూరుకోక యిప్పుడేమిటి చెయ్యడం?......కృష్ణు డుంటే యేమీ లోటుండదు. ఇప్పు డతను లేడు. నాగమ్మగారి కింకేమీ లేదు. అంతా శూన్యం. అంతా అంధకారం. విజయనగరంలో అలాంటి మనిషి లేడు. దేవుడి కళ్లతని మీదే పడ్డాయి.

తిమ్మరుసు—కృష్ణుడు సర్వలక్షణసంపన్నుడే కాకపోతే అలాంటి రాజాజ్ఞ పుట్టివుండకే పోవును.

లక్ష్మమ్మ—పుట్టినా నాకు దుఃఖమే లేకపోవును... ......(నిట్టూర్పు విడిచి) విడుస్తూ విడుస్తూ వున్న తామరమొగ్గని చిదిమేశా రండీ మీరు.

తిమ్మరుసు—చెప్పాను కాదూ? మనుష్యు డేం చెయ్యగలడూ? అయినా, కృష్ణు డీక్షుద్రమానవలోకంలో వుండతగ్గవాడు కాదు.

లక్ష్మమ్మ—అలాంటి వాళ్లుంటే మానవలోకానికి క్షుద్రత్వమే లేకుండా పోతుంది......కానివ్వండి......

అధర్మం జయించింది......అయితే, యిదే స్థిర మయి పోతుందా ?

తిమ్మరుసు—అలా అయితే, అసలు, స్థిరమైన పదార్థం యేం వుంది లక్ష్మీ ?

లక్ష్మమ్మ—చివరికి వేదాంతం......అవును. కృతకృత్యులై సవా రెన్నేనా శ్రీరంగనీతులు చెబుతారు.

(అప్పుడే తొక్కి దూకున నీలమ్మ లోపలికి వస్తుంది. తిమ్మరుసు వులిక్కిపడి చూస్తాడు. నీలమ్మ కైజారు దూసి తిమ్మరుసును పొడవబోతుంది. లక్ష్మమ్మ చకితురాలై నీలమ్మ చెయ్యి పట్టుకుంటుంది)

తిమ్మరుసు—(ఉరిమినట్లు) నిలు. (సరిగా కూచుని) నువ్వా ? సరే. (వక్షస్థలం చూపించి) పొడు. విడిచిపెట్టు లక్ష్మీ !

నీలమ్మ—(స్తబ్ధఅయి కైజారు జారవిడిచి దుఃఖంతో కూలబడి) పాపాత్ముడా ! నా కృష్ణుణ్ణి చూస్తే నీకు కళ్లు కుట్టాయా ?

లక్ష్మమ్మ—(నీలమ్మ చెయ్యి విడిచిపెట్టి, నీలమ్మ కేసీ, తిమ్మరుసు కేసీ చూస్తూ వుంటుంది)

తిమ్మరుసు—(నీలమ్మ కేసి గంభీరంగా చూస్తాడు)

నీలమ్మ—నా కృష్ణుడు—నా దేవుడు—నారాయుడు ఏన్నేం చేశాడూ ? ఎవళ్లని మాత్రం యేమి చేశాడూ? దేవాలయంలోనుంచే తీసుకుపోయావుట. ఒక్కమాటు మొఖంటబడనిస్తే నీపుట్టి మునిగిపోవునా ?......దుర్మార్గుడా ! ఈ పాపం నిన్ను కట్టి కుడపదూ ?

లక్ష్మమ్మ—ఎవ రండీ యీ అమ్మాయి ?

తిమ్మరుసు—పాపారాయడుగారి కూతురు. నాగమ్మగారికి మేనగోడలువరస. తలిమ్మా సంగతి బోధపడిందా ? (నీలమ్మతో) నీలా ! లే. కూచునే వున్నావేం? కైజారు పుచ్చుకో. నాపని నేను చేశాను. నీపని నువ్వు చేసుకో.

నీలమ్మ—(లేచి, పులుకూపులుకూ చూస్తూ) నిన్ను పొడిచేసి, నీయిల్లాలిని నాలాగ చెయ్యడమే నాపని. క్షణం దాటిపోయింది. సమయాని కీవిడ దగ్గిరే వుండిపోయింది.

తిమ్మరుసు—ఉంటే యేమీ ? ఈ మాటు అడ్డుకోదులే.

లక్ష్మమ్మ—ఎంత పని చేశా రండీ మీరా ?

నీలమ్మ—(లక్ష్మమ్మని చూసి, తిమ్మరుసు కేసి తీవ్రంగా చూస్తూ) కళ్లు మూసుకుపోయి వున్నావు. మంచీ చెడ్డా యేమేనా తెలిస్తేనా ? బ్రాహ్మణుట. చండాలుడు. రాక్షసుడు. (లక్ష్మమ్మ కేసి తిరిగి) నీ సహకారం చెయ్యక తప్పదు. అయ్యు, రాజు చావడంవల్లా, యీయన అక్కడ చెప్పే వాడు లేకపోవడంవల్లా నీ మొగుడికి స్వాతంత్ర్యం వచ్చిందని పొంగిపోతున్నావు కాదూ నువ్వు ?......ఎంత సేపూ యీ పొంగు ?........నేనూ ఆడదాన్నే. ఆడదాని హృదయస్పందనం యేలాగ వుంటుందో ఆడదానికి తెలవాలి కాని మొగాడను కేవిటి తెలుస్తుంది ?......నీ కళ్ళకి కూడా బాష్ప కలిగించడం యెందుకూ ? (తిమ్మరుసు కేసి తిరిగి) వాశకార్య ధురంధరా ! జాగ్రత్త. (కైజారు పుచ్చుకొని, చరుక్కున లేచి, వెళ్లిపోతుంది)

తెరలో

నిలు. ఎక్కడికి వెడతావు ?

తిమ్మరుసు—తమ్ముడూ ! ఏమీ అనకు. వెళ్లిపో నియ్యి.

లక్ష్మమ్మ—ఎవరంటా యేమి టండీ ?

తిమ్మరుసు—తరవాత చెబుతాను. (లేచి నుంచుని) అక్కడ, నాగమ్మగారి ఆత్మబంధువులు ఎక్కువ వుంటారు. దాసీలు కూడా కత్తులు దూస్తున్నారు. కావడానికి వీలులేదు. (కిటికీకి చూస్తూ) గోవిందా !

తెరలో

వస్తున్నాను.

లక్ష్మమ్మ—ఏమిటి తరవాయి ?

తిమ్మరుసు—చూస్తూ వింటూ వుండు.

గోవిందరాజు—(ప్రవేశించి) ఎందుకన్నయ్యా ?

తిమ్మరుసు—కత్తి తీసుకురా.

గోవిందరాజు—బాకు చాలా ?

తిమ్మరుసు—చంద్రహాసమే తీసుకురా.

గోవిందరాజు—సరే. (వెళ్లిపోతాడు)

లక్ష్మమ్మ—ఇప్పుడేనా మీరు శాంతికోసం చూడరన్నమాట.

తిమ్మరుసు—శాంతా ?......ఇక నాకేటే శాంతి. నిష్క్రమించాక శాంతి యేమిటి ? అగ్నిహోత్రం పూర్తంతా పాకిపోయింది ఇప్పుడే. ఉరిసెలు వేస్తూవుంటుంది. జగన్నాథరథం కదిలింది. ఇక నిలవదు. లయం కావాలి. జనక్షయం కావాలి. రక్తం ప్రవహించాలి. ఇక పాలోపాలి అయిపోతారు. ఆడవాళ్లూ మొగవాళ్లూ కూడా కలసి టమే. మారణం యెన్నివిధాల జరగడానికవకాశం వుంటుందో అన్ని ప్రయత్నాలూ జరుగుతాయి. లక్ష్మీ! బోధపడిందా ? సుడిగాలి వీస్తుంది. మూలనున్నవాళ్లు కూడా మారుగుకి వస్తారు. ఈతుపాను నీ వేళ్ళకి కూడా మొగ్గేవుంది.

లక్ష్మమ్మ—ఎరుగుదును.

తిమ్మరుసు—ఈకల్లోలం అణిగిపోయేదాకా నాకు తెరపివ్వదు. నువ్వెక్కడో, నేనెక్కడో ? తెలిసిందా ?

లక్ష్మమ్మ—కానివ్వండి.

తిమ్మరుసు—జాగ్రత్త. ఎప్పటికి కేమిటో;

లక్ష్మమ్మ—గోతిలో పోయీదాన్ని గొడ్డలికి తెచ్చారు మీరు. స్త్రీల చాతుర్యం కూడా చూస్తారు పురుషులిప్పుడు.

గోవిందరాజు—(కత్తి తెచ్చి తిమ్మరుసు చేతి కందిస్తాడు)

తిమ్మరుసు—(కత్తి పుచ్చుకొని వొరలోనుంచి కొంచెం తీసి చూచి) మొన్ననే చికిలీ చేశాడు కమ్మరి. వెంటనే పని—(అర్థోక్తి)

లక్ష్మమ్మ—(ఆ కత్తి పుచ్చుకొని) ఇంకోటి చూసుకోండి మీరు.

గోవిందరాజు—(ఉలిక్కిపడతాడు)

తిమ్మరుసు—(గంభీరంగా నిలిచి) ఏమిటీ ?

లక్ష్మమ్మ—తరవాత మాట్లాడుకుందాం.

తిమ్మరుసు—అంటే ?

లక్ష్మమ్మ—అక్కడ మీరూ యిక్కడ నేనూనూ.

తిమ్మరుసు—ఏమి టదీ ?

లక్ష్మమ్మ—అక్కడ మీ రేం చేస్తే, యిక్కడ నే నదీ. ముందు ఆడదాన్ని, తరవాత రెక్కలు లేని దాన్ని చేసి, నాగమ్మనారికి, చివరికి, సర్వనాశం చేస్తారా మీరు ? నేను చూస్తాను. దిక్కులేనివాళ్లకి దేవుడే దిక్కు. గర్వించకండి. జగన్నాథరథం కదిలిందన్నారు మీరు. నిజమే. నాలుగు తలుపులూ బిగించి పట్టి బంధిద్దామంటే పిల్లి, గుడ్లు పీకేస్తుందని యెరుగుదురా మీరు ? సముద్రం చెల్లని దైనా అందులో బడబానలం వుందనీ, రాక రాక అది పైకి వస్తే యిక సప్తసముద్రాలుండవనీ తెలుసునా మీకు ?......వెళ్లండి. (కత్తి మొన నేలమీద ఆనించి, ప్రత్యాలీఢపాదంగా నిలిచి, శిరసు వంచుకుని) నాకు సెలవివ్వండి.

తిమ్మరుసు—(భార్య శిరస్సుమీద చెయ్యి వుంచి) లే. నీప్రయత్నం కొనసాగుగాక.

లక్ష్మమ్మ—(లేచి) సెలవు. (వెళ్లిపోతుంది.)

గోవిందరాజు—జయం కలగాలని దీవించావేమిటన్నయ్యా ?

తిమ్మరుసు—ఏం ?

గోవిందరాజు—నీకు నువ్వే అపజయం—(అర్థోక్తి)

తిమ్మరుసు—అవును. కొడుకు చేతిలో తండ్రీ, భార్య చేతిలో భర్తా వోడిపోడం కంటె అందం యేమి వుందోయ్ ? సంగతి కనిపెట్టావా ? సంక్రమించిన అధికారం అన్యాక్రాంతం కాకుండా వుండడానికి ఆవిడ ప్రయత్నిస్తే, అధికారం సంపాదించుకోడాని కీవిడ ప్రయత్నిస్తారు. అక్కడ భర్త మంత్రీ, యిక్కడ భార్య మంత్రీనీ, ఎంత చక్కని సన్నివేశమో చూశావా ? ప్రపంచకంలో వొక్క నాకు తప్ప యిలాంటి యోగ్యత మరెవరికీ కలగలేదు. ఇక కలగదు కూడానూ.

గోవిందరాజు—చాలా తమాషాగా వుంది.

తిమ్మరుసు—ఇంకా సందేహమా ?

గోవిందరాజు—కాని వదిన వొంటరిగా వెళుతోంది. నీలమ్మ యిప్పుడే అల్లరి చేసి వెళ్ళింది. దారిలో కనబడితే—(అర్థోక్తి)

తిమ్మరుసు—కనబడడమే వస్తే వెంటనే కత్తు కలిసిపోతుంది. ఏమీ భయపడనక్కరలేదు.

తెరలో

"సూరప్పా"

"రథం వచ్చి సిద్ధంగా వుంది అమ్మగారూ"

"సరే"

తిమ్మరుసు—అప్పన్నని వొకమాటు తీసుకురా.

గోవిందరాజు—సరే. (వెళ్లిపోతాడు)

తిమ్మరుసు—వుద్ధారాలు పుట్టాయంటే ఆశ్చర్యమా ? మహారాజు, చస్తూ చస్తూ సుఖంలో వున్న ప్రాణాలను దుఃఖంలో వేసి పోయారు. ఎరగనివాళ్లకి రాజ్యాశ పుట్టించారు. లక్ష్మి మంత్రాంగంలో తిమ్మరాజు హత్యకోసం ప్రయత్నాలు జరుగుతాయి. నీలమ్మ, నామీద కసి అలా తిప్పుతుంది. దీని కంతటికీ యెదటి పచ్చ సహించలేని ఓబమ్మగారే కారణం. కృష్ణరాయడు లేకపోవా లంటే, యిప్పు డావిడకు మనము డేనా తక్కే యోగం లేనట్టుంది............వీరభోజ్య మైన రాజ్యం కోమటియుక్తులకు నిలుస్తుందా ?

గోవిందరాజు—(నాదిండ్ల అప్పన్నతో వచ్చి) అప్పన్న వచ్చాడు.

తిమ్మరుసు—వచ్చాడా ? అప్పన్నా ! సంగతంతా గ్రహించావా ?

అప్పన్న—పూర్తిగా గ్రహించాను. తుపాను చెలరేగే టట్టుంది; కాని యిప్పటిమట్టుకి పట్నం అంతా నిమ్మకు నీరుపోసిన ట్టుంది.

తిమ్మరుసు—అంటే గుసగుసల్లో వుం దన్నమాట వ్యవహారం......సర్వసైన్యాధిపత్యం నీదీ. వెళ్లిపో. జాగ్రత్త సుమా !

అప్పన్న—మీ కేమీ బెంగ అక్కరలేదు. అంతా నిశ్చలంగా వుంచుతాను.

తిమ్మరుసు—సరే. వెళ్ళు.

అప్పన్న—మంచిది. (వెళ్లిపోతాడు.)

తిమ్మరుసు—గోవిందా !

గోవిందరాజు—ఏందు కన్నయ్యా ?

తిమ్మరుసు—విజయనగరంలో చెలరేగుతూ వున్న యీ అంతఃకలహాలు కారణంగా సామంతులలోనూ, సరదారులలోనూ స్వేచ్ఛావాంఛ పుట్టవచ్చు. శత్రువులు భేరీలు మోగించవచ్చు. జాగ్రత్త. పట్నం నీచేతిలో వుంచుతున్నాను.

గోవిందరాజు—సంతోషం. ఏమీ అపాయం రానివ్వను.

తిమ్మరాజు—మరి వెళ్లిపో.

గోవిందరాజు—ఇదిగో, వెళ్లిపోయాను. (వెళ్లిపోతాడు)

తిమ్మరుసు—ఇది సుఖాంతం అవుతుందా, దుఃఖాంతం అవుతుందా ? చూస్తూ వుండగా వ్యవహారం యెంత ముదిరిపోయింది ?.........మునిగిపోయిం దేమీ లేదు. కంగా రెక్కర్లేదు. (చేతులు చూసుకొని) కత్తిమాట మరిచేపోయాను......అక్కడికే వెళ్ళి పుచ్చుకుంటాను. కాకపోయినా, సర్దార్లలో పటుత్వం వుంటే యెదటివాళ్ళ ఆయుధాలు మనచేతికే వస్తాయి.

(వెళ్ళిపోతాడు)

రెండో రంగం

(నాగమ్మనగరు. ఒక వసారాలో నాగమ్మ పీటమీద కూచుని వుంటుంది. సైజారు ముందు పెట్టుకుని ఆమె కొక పక్కగా నీలమ్మ కూచుని వుంటుంది. అపనిమీదా, యీపనిమీదా, మధ్య మధ్య, దాసీలు వస్తూ పోతూ వుంటారు.)

నాగమ్మ—నేను పెద్దదాన్ని. నువ్వు చిన్నపిల్లవు. పైగా యిద్దరికీ దుఃఖం తలమునకలుగా వుంది. మనం పగ తీర్చుకోగలమా ?

నీలమ్మ—ఎందుకు తీర్చుకోలే మత్తయ్యా ? యథాశక్తి. ఎవరు చేసినా అంతే. పుట్టింది రాచకులం. పైగా, అపకారమూ, పరాభవమూ జరిగాయి. శరీరం దహించుకుపోతూవుంది. ఇక యీజన్మకి సుఖ మెలాగా లేదు. బతుకూ సందేహమే. వీలయినంత వర కేనా పగ తీర్చుకోకపోతే యిక చేసే దేం వుందీ ?

నాగమ్మ—నాకూ నీకూ భేదం వుంది.

నీలమ్మ—పాతా కొత్తానూ. అంతకంటే యేమీ లేదు. తిమ్మరుసయ్య చేసిన గాయంమీద మీరు కారం చల్లవద్దు.

నాగమ్మ—కొంచెం వెనకా ముందూ చూడవూ తల్లీ?

నీలమ్మ—వెనుక నుయ్యీ, ముందు గొయ్యీనీ. అడియాసలు వద్దు అత్తయ్యా!

నాగమ్మ—నీది వ్యగ్రోత్సాహం.

నీలమ్మ—కసకసే పగ తీర్చుకోవా లని సైరా నయి పోతున్నాను. తిమ్మరు సయ్యని విడిచిపెట్టినా యిబ్బంది లేదు; కాని ఆనిర్భాగ్యుణ్ణి పొడిచివెయ్యాలి.

నాగమ్మ—ఏనిర్భాగ్యుణ్ణి?

నీలమ్మ—వాణ్ణీ...... తెలువలేదూ ? ఎవడి అధికారం నిలవ దని చచ్చినరాజు ఇంత పని చేయించాడో —(అర్ధోక్తి)

నాగమ్మ—తిమ్మరాజునా?

నీలమ్మ—పేరుచ్చరిస్తే పాపం చుట్టుకుంటుంది. వాణ్ణే.

నాగమ్మ—(ఉద్రేకంతో) ఏమన్నావు కోడలా?

నీలమ్మ—(ఆవేశంతో) ఎవడిమూలంగా నాకు బావయ్యగారు లేకపోయారో ఆయేల్నాటిశనిగాణ్ణి హతంచేసి,మీ పెద్దసవతికడుపున చిచ్చుపెట్టి—(అర్ధోక్తి)

నాగమ్మ—అదీ మాట! నీలం! ఎంత చల్లని మాట చెప్పావూ? ఒక్కమారి లా రా తల్లీ!

(నాగమ్మ చేతులు చాపుతుంది. నీలమ్మ దగ్గిరికి వెళ్లి కూచుంటుంది. నాగమ్మ నీలమ్మని గట్టిగా కౌగిలించుకుని మూర్ధాఘ్రాణం చేస్తుంది.)

నాగమ్మ—నాకూనా! ఇక నీకు అడ్డు చెప్పను. ఎలా చేస్తావో ఆకాస్త పనీ చేసేస్తివా తరువాత నువ్వూ నేనూకూడా బావయ్యదగ్గిరికి సంతోషంగా వెళ్లిపోవచ్చును.

నీలమ్మ—ఇంతవరకూ నాకు కసే గాని మీ ప్రోత్సాహం లేదు.ఇక చూడండి, ఈరాత్రి కడిచాటప్పటికి యేడుపులూ పెడబొబ్బలూనూ.

(అప్పు డొక దాసి లోపలికి వస్తుంది)

దాసి—లక్ష్మమ్మగారు వస్తున్నారుట అమ్మగారూ!

నీలమ్మ—తిమ్మరుసయ్య పెళ్లామా? (లేచి వెళ్లిపోతుంది)

నాగమ్మ—పరామర్శకి కాబోలు. మొగుడు మింగెయ్యడమూ, పెళ్లాం వగచడమూనూ.

నీలమ్మ—(పరుగుపరుగున వచ్చి కైజారు దూసి చేతపుచ్చుకుని) లక్ష్మమ్మ ఖడ్గం పట్టుకుని వస్తోంది. నేను చెయ్యబోయిన పనికి బదులు చేస్తుంది కాబోలు. వచ్చిం దంటే పొడిచేస్తాను. ఏ మత్తయ్యా?

నాగమ్మ—తొందరపడకు తల్లీ !

నీలమ్మ—ఇక నేను ఆగలే నత్తయ్యా !

నాగమ్మ—వచ్చిన పనేమిటో తెలుసుకోకుండా దుడుంగు మంటే గేలం వెయ్యవచ్చునా అమ్మా ?

నీలమ్మ—(మొగం వంచుకుని వూరుకుంటుంది)

దాసి—ఏమి సెలవు అమ్మగారూ ?

నాగమ్మ—తీసుకురా.

దాసి—చిత్తం అమ్మా! (వెళ్లిపోతుంది)

నాగమ్మ—వెంట యెవ రేనా వున్నారా తల్లీ ?

నీలమ్మ—ఆవిడ తమ్ముడు, మాచిరాజు వియ్యన్న గారు కూడా వస్తున్నారు.

నాగమ్మ—(ఆలోచిస్తూ) ఎందు కయి వుంటుందీ ?

(అప్పుడు దాసివెంట లక్ష్మమ్మా, మాచిరాజు వియ్యన్నా వస్తారు. దాసి పక్కకి తప్పుకుంటుంది. నాగమ్మ, చూచి, మొగం వంచుకుంటుంది.)

నీలమ్మ—(లేచి) అక్కడే నుంచో. అడుగు ముందుకు వేశా వంటే బాగా జరుగదు.

లక్ష్మమ్మ—బాగా జరగ దంటే ?

నీలమ్మ—పొడిచేస్తాను.

లక్ష్మమ్మ—నీయిష్టం.నాకేమీ అభ్యంతరం లేదు. నీకంత వుబలాటంగా వున్నప్పుడు నే నెందుకు కాదనాలీ? అయితే: ఇక్కణ్ణుంచి అడుగు ముందుకి వేస్తే కదా పొడవడం ? పని వచ్చినప్పుడు నేను చెప్పే అడుగువేస్తానులే. నాగమ్మగారూ ! తమకు గొప్ప ఆపద వచ్చింది.

అయినా నేనిప్పుడు పరామర్శ చెయ్యడం కోసం రాలేదు.

నాగమ్మ—భర్తగారు చేసిన దానికి తరవాయి తీర్చడానికి వచ్చారా? అది రాజుగారి ఆజ్ఞ అయితే యిది రాణీగారి ఆజ్ఞ గాబోలు.

లక్ష్మమ్మ—రాజు చచ్చిపోయాడు. ఇక రాణీ అంటే యెవరూ?

నాగమ్మ—(చకిత అయి చూస్తూ వూరుకుంటుంది)

లక్ష్మమ్మ—విజయనగరిసింహాసనం యిప్పుడు ఖాళీగా వుంది. రాజే లేనప్పుడు రాణీఅంటే యేమిటీ?

నాగమ్మ—తమ మాటలు విచిత్రంగా వున్నాయి. ఏదో కొత్తధోరణి స్ఫురిస్తోంది. కాని మొదలూ తుదా అవగాహన కావడం లేదు. తమరు, నేననుకున్న ఉనికిలో సంవచ్చివుండకపోతే, తమ వుద్దేశం యేమిటో స్పష్టంగా సెల విప్పించండి.

లక్ష్మమ్మ—ముందు, తమరు, నాకొకటి దయచేస్తే తరవాత నేనంతా సవిస్తరంగా మనవి చేసుకుంటాను.

నాగమ్మ—అదేమిటీ?

లక్ష్మమ్మ—తమరు నాకు మంత్రిపదవి దయచెయ్యాలి.

నీలమ్మ—(ఉద్రేకంతో) వల్లకాదు. నువ్వు మాకక్కరలేదు.

నాగమ్మ—ఒక్క నిమిషం వూరుకోతల్లీ! (లక్ష్మమ్మతో) తమకు మంత్రిపదవి యివ్వడానికి మారేం వుంది లక్ష్మమ్మగారూ?

లక్ష్మమ్మ—ఉపయోగించుకోవా లనే సంకల్పం వుంటే అన్నీ వున్నాయి. సరసరాయలవారి దేవేరికి లేని దేమిటీ?

నాగమ్మ—దానివల్ల నాకేం వచ్చిందీ?

లక్ష్మమ్మ—ఆశ తెంపుకుని కూచుంటే నే నేం చెప్పగల నమ్మా?

నాగమ్మ—తమరు నాకు బోధపడేటట్టు సెల విప్పించాలి.

లక్ష్మమ్మ—వీడి తరవాత రాజు కావలసినవాడు ఫలానా అని యిద్దరి మొగాల మీాదా రాసివుంటుందా అమ్మా? రాజయోగం వున్నవాడు ఒకరాజుకి ఉత్తరాధికారి కావచ్చు. ఒక రాజ్యం అయినా కల్పించుకోవచ్చు. ఒకడి రాజ్యం అయినా ఆక్రమించుకోవచ్చు. రాజుల కొడుకు లెందరో భిక్షాధికారు లయిపోయారు. సామాన్యు లెందరో రాజు లయిపోయారు. తమభర్త గారి చరిత్ర మననం చేసుకుంటే చాలదూ అమ్మా?

నాగమ్మ—తమరు నామనస్సు కెక్కిస్తూ వున్న దమృతమో విషమో తెలవడం లేదు.

నీలమ్మ—విషం విషం. ఈ విడ మాటలు నమ్మకండత్తయ్యా!

నాగమ్మ—కాస్త వోపిక పట్టవమ్మా తల్లీ! ఏమంటారు లక్ష్మమ్మగారూ తమరూ?

లక్ష్మమ్మ—ఇప్పుడేనా నాకు మంత్రిపదవి యిస్తారా?

నాగమ్మ—బోధపడుతోంది. అదా సంగతి? అయితే ప్రయోజనం వుంటుందా?

లక్ష్మమ్మ—నాకు మంత్రిపదవి దయచేస్తే గాని వొక్క అక్షర మేనా చెప్ప నిక.

నాగమ్మ—భల్లూకపు పట్టు పట్టారే? సరే మరీ. మోసం జరిగినా యిదివరకి జరిగిన విపత్తు కంటే గొప్పది జరగదు. (లేచి, లక్ష్మమ్మని సమీపించి) ఇదిగో నా భవిష్య దభ్యుదయానికి తమర్ని నామంత్రిగా ఏర్పరుచుకుంటున్నాను. (చేతిలో చెయ్యి వేస్తుంది)

లక్ష్మమ్మ—అంటే?

నాగమ్మ—నాకు పదవి వచ్చాక తమరు మంత్రు లన్నమాట.

లక్ష్మమ్మ—అయితే, నేను సలహాలూ ఆలోచనలూ అప్పణ్నుంచే చెబుతాను.

నాగమ్మ—అయితే ఏమంటారూ తమరూ?

లక్ష్మమ్మ—ఆపదవి నాకిప్పుడే స్వాధీనం కావాలి.

నాగమ్మ—అయితే సరే. తమరు ఇప్పణ్నుంచీ నాకు మంత్రిగా వుండండి. ఇదే మాట. (మళ్లీ చేతిలో చెయ్యి వేస్తుంది)

లక్ష్మమ్మ—ఇక వినండి.

నాగమ్మ—సెల విప్పండి.

లక్ష్మమ్మ—రాజ్యాలు మంత్రాధీనాలు. మంత్రు లంటే మంత్రాలకు భౌతికస్వరూపాలు. కనక ప్రభువులు మంత్రుల మాటలు పాలిస్తూ వుండాలి.

నాగమ్మ—సరే.

లక్ష్మమ్మ—అక్కడ భర్త మంత్రీ, ఇక్కడ భార్య మంత్రిణీ. తత్వం గ్రహించగలవాళ్ళ కేమీ వుండదు; గాని సామాన్యదృష్టికి మాత్రం యిందులో తీసినకొద్దీ అర్థా లున్నాయి.

నాగమ్మ—అవును.

లక్ష్మమ్మ—తమకు తీరని అపకారం జరిగింది. అప కారం అంటే అంతటిదీ యింతటిదీ కాదు, కడుపుచిచ్చు. అయితే: ఈ అపకారం యెవరు చేశా రని కాదు ప్రశ్న, ఎవరు చేయించారు ? ఇది తమకు సంభవించడానికి కార ణం వొకరూ, సాధనం వొకరూనూ,

నాగమ్మ—ఊహూ,

లక్ష్మమ్మ—తమ కుమారుణ్ణి చంపినవారు మా వారే; కాని చంపించినవారు తమ సవతి కొడుకు.

నాగమ్మ—అవును. ఏమీ సందేహం లేదు. అం దులో సవతి ప్రోత్సాహం కూడా చాలా వుంది. ఆవిడ నాకొడుక్కి విషప్రయోగం చేయించడానికి మూడుమా ట్లు ప్రయత్నించడం నే నెరగనూ ?

లక్ష్మమ్మ—అవునుగదా ?

నాగమ్మ—ఏగ్రహం వక్రించడంవల్లనో యిప్పుడిలా చేశారు; గాని అప్పుడు తమ భర్తగారే కాదూ నా తండ్రిని రక్షించినవారూ ?

లక్ష్మమ్మ—అంటే తమకి శత్రువు లెవరో సాధించ వలసినవా రెవరో తెలుసు నన్నమాట.

నాగమ్మ—కానివ్వండి.

లక్ష్మమ్మ—కానివ్వ మంటే కాదు. నామాటలు తమరు నమ్మారా లేదా ?......ఒకటి మనవి చేస్తాను ఆలకించండి. ఇప్పుడు నేను తమకి మంత్రిగా వున్నాను. ఒకర్ని నాశనం చేయించడానికి తమరు నిశ్చయించుకుం టారు. అది చెయ్యవలసిం దని నా కాజ్ఞాపిస్తారు. నేనా పనిచెయ్యాలా అక్కర్లేదా ?

నాగమ్మ—ఊఁ.

లక్ష్మమ్మ—ఊఁ అంటే కాదు. స్పష్టంగా సెల విప్పండి.

నాగమ్మ—చెయ్యాలి.

లక్ష్మమ్మ—మావారు చేసిన పని అంతే.

నాగమ్మ—సరే.

లక్ష్మమ్మ—తమమీద మావారి కేమీ ద్వేషం లేదు. తమరుకూడా వారిని ద్వేషించకూడదు.

నీలమ్మ—ఇదా అమ్మా యెత్తు ? ఇత్తయ్యా! —(అర్థోక్తి)

నాగమ్మ—ఇంకొక్క క్షణం వూరుకో తల్లీ! సెల విప్పించండి లక్ష్మమ్మగారూ!

లక్ష్మమ్మ—కృష్ణుడు ప్రయోజకుడు కనక తమ అనంతరం తమ కొడుక్కి రాజ్యం దక్కనివ్వ డేమో నని తమ సవతికొడుకు ఇంతపని చేయించారు. కృష్ణుడు లేక పోతే మాత్రం ఆపిల్లాడికి రాజ్యం తక్కకుండా చెయ్య డానికి మన కేమి అడ్డూ ?

నాగమ్మ—బాగా సెలవివ్వండి

లక్ష్మమ్మ—ఏరాజ్యంకోసం వారు మనకృష్ణుణ్ణి లేకుండా చేశారో, ఆరాజ్యంకోసం మనమున్నూ అకుర కుంకని లేకుండా చేద్దాం

నాగమ్మ—చాలా బాగానే వుంది. కాని సాధ్యమా?

లక్ష్మమ్మ—అది సాధ్యపడుతుందా, రాజ్యం మనది. ఓడిపోతామూ ? తమ కిదివరకే సర్వనాశం సంభ వించివుంది.

నాగమ్మ—ఊహూ.

లక్ష్మమ్మ—అదీకాక : మనుష్యులు జయం అను కుంటే అపజయం కావచ్చు. అపజయం అనుకుంటే జయ మున్నూ కావచ్చు. ఇది చిట్టచివరగాని తేలే విషయం కాదు.

నాగమ్మ—అవును

లక్ష్మమ్మ—కనక ముందు మనం ఆపురుగును సలిపివేద్దాం

నాగమ్మ—(చకితయై నీలమ్మకేసి చూస్తుంది)

నీలమ్మ—బాగానే కనబడుతోంది. మనం అనుకున్నదీ యిదే కాదూ?

నాగమ్మ—ఇంకా సెల విప్పండి లక్ష్మమ్మగారూ!

లక్ష్మమ్మ—ఈపని చేస్తే వారూ మనమూ సమానమౌతాం. ఇక రాజ్యం—

నాగమ్మ—ఆమహారాజు కొడుకు అచ్యుతరాయడుండనే వున్నాడు. ఆవిషయంలో మన కేమీ ఆలోచన లక్కరలేదు.

లక్ష్మమ్మ—అతడుమాత్రం కృష్ణుడికంటేయెక్కువా నాగమ్మగారికి?

నాగమ్మ—అవునుసుమండీ! వంశం అయినా నిలవనిస్తుందో లేదో ఆరాక్షసి.

లక్ష్మమ్మ—కనక సింహాసనం కూడా మన దృష్టిలో వుండవలసిన దే.

నాగమ్మ—అయితే: మనం యింతపని చెయ్యగలమా లక్ష్మమ్మగారూ?

లక్ష్మమ్మ—ఎందుకు చెయ్యలేమూ? పురుషులయినా స్త్రీలయినా జీవనం వొకటే. పగలోనూ, ఆశలోనూ, ఫలంలోనూ, అనుభవంలోనూ స్త్రీ అనీ పురుషుడనీ యేర్పాట్లేమీలేవు. లోకవృత్తం పరిశీలిస్తే మొగవాడికంటే ఆడది లొచ్చు అని యింకా నిర్ధారణ కాలేదు. "మాకు అడ్డేమిటి?" అని గర్వించిన పురుషుల్ని స్త్రీలు బోల్తా కొట్టించిన సందర్భాలెన్నో వున్నాయి. రుద్రమ్మతల్లిని మరిచారా అమ్మా?

నాగమ్మ—సరే. ఇక ఆవిచక్షణ చెయ్యడం యెందుకూ? ఏటి కడ్డుపడదాం. అయితే డబ్బేమాత్రం కావా లంటారూ?

లక్ష్మమ్మ—ఖర్చుపెడితే కోట్లు చాలవు. లేకపోతే పని అడ్డదు. (పక్కకి చూసి) ఇలారా తమ్ముడూ!

వియ్యన్న—(చేతులు కట్టుకుని వచ్చి నాగమ్మ యెదట వంగి నుంచుని) తమ సెలవు కోసం యెదురు చూస్తున్నాను.

లక్ష్మమ్మ—ఇతను నాకు తమ్ముడు. మా పిన్తల్లి కొడుకు. పేరు మాచిరాజు వియ్యన్న. బావగారికి తీసిపోడు. తమరు మాతమ్ముణ్ణి పూర్తిగా సమ్మి ఈపనిలో నియోగించుకోవచ్చు.

నాగమ్మ—చిత్తం, అలాగే చేద్దాం.

లక్ష్మమ్మ—తగినంత పని కలిగే దాకా లోపలే వుందాం మనం. ప్రత్యక్షంలో సేనాధిపతి అయినా, మంత్రి అయినా, నౌకరు అయినా సర్వమూ మా తమ్ముడే.

నాగమ్మ—(వియ్యన్నతో) మమ్మల్ని వొడ్డెక్కించాలి తమరు. (చేతులు జోడించుకుని ప్రార్థిస్తుంది)

వియ్యన్న—ఏలినవారి సేవలో నాజీవితం ధార పోస్తాను. తమరు నిశ్చింతగా కూచోవచ్చు.

నాగమ్మ—ఇం కెవరున్నారూ మనకీ?

లక్ష్మమ్మ—మా మరిది గోవింరాజూ, నాఅల్లుడు అప్పన్నా సమయానికి మన పక్షంలోనే వుంటారు. వారి నిబట్టి యింకా అనేకమంది వుంటారు. తమరు దిక్కుమాలిన స్థితిలో లేరు నాగమ్మగారూ!

నాగమ్మ—తమరుండగా నాకు దిక్కు లేకపోవడం యేమిటి లక్ష్మమ్మగారూ

లక్ష్మమ్మ—కనక, యిక్కడి సంగతి చెప్పండి. తమ ఆత్మబంధువులలో—(అర్థోక్తి)

నాగమ్మ—నీలమ్మని చూస్తూనే వున్నారు తమరు.

నీలమ్మ—ఆపురుగుని నేనే సలిపివేస్తాను.

లక్ష్మమ్మ—ఒక సంగతి, ముందు, తమతో మనవి చేసుకుంటున్నాను. ఒకరి మాటలు విని తమరు నన్ను మానించగూడదు. నేనేమి చెప్పినా వెంటనెంటనే జరిగి పోతూ వుండాలి.

నాగమ్మ—అలాగే జరుగుతాయి. తమయెడల నాకు పూర్తిగా విశ్వాసం కలిగింది. అయితే: మానీలం అలా యెందుకు చేసిందో—(అర్థోక్తి)

లక్ష్మమ్మ—యెరుగుదును.

నాగమ్మ—నాకోడలిని తమరు క్షమింపకోరుతున్నాను. లక్ష్మమ్మగారి పాదాలు పట్టుకోతల్లీ !

నీలమ్మ—చిత్తం. (వంగి, లక్ష్మమ్మ పాదాలు పట్టుకుని) నాసంగతి యెరుగుదు రన్నారు తమరు. క్షమించి రక్షించండి.

లక్ష్మమ్మ—(ఆమెని ఆదరంతో లేవనెత్తి) మీ రేమి చేశారో నేను మరిచిపోయాను. మీరు కూడా మరిచిపొండి. మన మిప్పుడు పగ సాధించాలి. మాకృష్ణుణ్ణి కూడా మరిచిపోవాలి మీరిప్పుడు.

నీలమ్మ—సాధ్యమా ?

లక్ష్మమ్మ—సాధ్యం చేసుకోవాలి. మన పని అయే దాకా మరిచిపోవాలి. ఈలోపున మీరు కనక కృష్ణుణ్ణి తలుచుకున్నా రంటే మీదీక్ష దుఃఖచ్ఛన్న మయి పోతుంది.

నాగమ్మ—అవునమ్మా! లక్ష్మమ్మగారి సెల వయే దాకా నాకడుపుచిచ్చు కూడా నేను మరిచిపోతాను.

నీలమ్మ—చిత్తం

లక్ష్మమ్మ—మేమిప్పటికి యింటికి వెడతాము. మళ్లీ యెప్పు డవసర మయితే అప్పుడు దర్శనం చేస్తాను. ఈ లోపుగా నాకర్లుండనే వున్నారు.

నాగమ్మ—బాగుంది. అవసర మయితే యాభై లక్షలు గుమ్మరిస్తాను.

లక్ష్మమ్మ—ఉండనివ్వండి. ఇప్పు డెందుకు తమ్ముడూ?

వియ్యన్న—వీకలమీదికి వచ్చేదాకా దమ్మిడీ అయినా కదపవద్దు. అవసరమున్నూ లేదు. మనకి సైన్యం లేదను కోవద్దు తమరు. ఖజానామీద కూడా మనకి చెలామణీ వుంది. తమరు ఆజ్ఞలు మాత్రమే దయచేయిస్తూ వుండాలి. చిత్తగిస్తారు కాదూ వియ్యన్న శక్తి సామర్థ్యాలూ ?

లక్ష్మమ్మ—మరి శెలవు.

నాగమ్మ—సెలవు.

వియ్యన్న—శెలవు దయచెయ్యండి.

నీలమ్మ—చిన్నత్తయ్యా! సెలవు.

నాగమ్మ—అయితే,లక్ష్మమ్మ గారూ! నాయన కడ తేరినట్టే ?

లక్ష్మమ్మ—తమ రత్నణ్ణి మరచిపోవాలి. మనస్సు రాయిచేసుకోవాలి.

నాగమ్మ—ఎందుకట్టి నయివున్నాను. అసలు మనస్సంటూ వొకటి వుంటేనా ?

లక్ష్మమ్మ—సెలవు.

నాగమ్మ—సెలవు.

(లక్ష్మమ్మా, వియ్యన్నా వెళ్ళిపోతారు. నాగమ్మా, నీలమ్మా, వారినిద్వారందాకా సాగనంపుతారు.)

నాగమ్మ—ఇదంతా యేమి టంటావు తల్లీ ?

నీలమ్మ—అన లేమి టయినా, చివరి కేమయినా సలహామాత్రం బాగుంది. బావయ్యగారిని కన్నందుకు తమరూ, కొలిచినందుకు నేనూ యింతకంటే చెయ్యావలసిం దేమీ లేదు.

నాగమ్మ—చంపి చచ్చిపోదాం. అంతే కాదూ ?

నీలమ్మ—మన భవిష్యత్తంతా లక్ష్మమ్మగారి చేతిలోవుంది. ఇప్పు డేమీ తేలదు.

నాగమ్మ—మొగుడికి తగ్గ పెళ్లాం ఆవిడ. తమ భార్యే మనపక్షంగా వుండడంవల్ల తిమ్మరుసయ్యంగారు మనమీద అంత ఉగ్రత చూపించకూడదు. ఇది కూడా వొకందుకు మంచిదే.

నీలమ్మ—మాబాబయ్యగారితో కూడా యీసంగతి కొంచం ఆలోచించడం మంచిదండీ అత్తయ్యా!

నాగమ్మ—అవును నాకూనా. కబురుచేద్దాం. ఇంతలోమనం కాస్త ధారకం చేదాం రా తల్లీ.

నీలమ్మ—దయచెయ్యండి.

సశేషం

# ఆంధ్రునికి ఆంధ్రదేశములో భిక్ష పుట్టడంలేదు



భావరాజు వేంకటకృష్ణారావుగారు బి. ఏ. బి. ఎల్

ఆంధ్రదేశానికి దూరదృష్టిగల నాయకుడు కావలయును. ఇపుడు దేశంలో చాలామంది నాయకు లున్నారు; కాని, ఈనాయకులు దేశానికి భవిష్యత్తునందు భాగ్యోదయ మగుటకు ఏమీ తోడ్పడరు— వీరి దృష్టి నేటి విపరీతపరిస్థితులలో కారుమేఘాలలో మెరిసే మెరపువలె అదృశ్యమైపోవుచున్నది. ఈదేశీయనాయకులకు ఒక్క మహాలోప మున్నది: ఎవరికి వారే తాము అందరికంటె గొప్పవార మని అహంభావము నడినెత్తిమీదికి గుప్పెడు ఎదిగి ఉన్నది. ఈనాయకులు పరస్పరద్వేషములతో, అసూయలతో అల్లాడి, కుళ్లిపోవుచున్నారు. అంతకంటె దేశహితైకపరులై, తమ తమ హృదయాలను పరిశీలించుకుని, ఒకళ్ల ఉద్దేశములను ఒకళ్ళు అర్థము చేసుకుని, తమ అభిప్రాయములను దిద్దుకుని, ప్రతికార్యము దేశక్షేమానికే వినియోగపడేటట్టు ప్రయత్నం చేస్తే చాలా బాగుంటుంది. నలుగురు నాయకులు ఐక్యభావము కుదిరేటట్టు నడుచుకుంటే మేలు. సొంత మేలు కొఱకు నేటి శ్రీమంతులు తంటాలుపడి గౌరవం పోగొట్టుకొనటం, వారికి శ్రేయస్కరం కాదు; దేశానికి ఉపయోగం లేదు.

* * * *

ఆంధ్రదేశంలో నాయకుల మని పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్న వారివల్ల ఆంధ్రుల కేమి భాగ్యము చేకూరింది? ఆంధ్రోద్యమమును నడిపిస్తా నని ఆశపెట్టి బొబ్బిలిరాజాగారు ముందుకు వచ్చారు. సగం త్రోవలో అటు యిటు గాని మహారణ్యంలో ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమమును వదిలిపెట్టి వెళ్లినారు. జమీందారుల సంఘంలో చేరడంచేత పర్లాకిమిడి, కల్లికోట రాజాగార్లకు ఆగ్రహం వస్తుందనో, లేక తమ సొంతలాభానికి ప్రయోజనకారిగా ఉండదనో, భయపడి ఆంధ్రోద్యమమును జాలి, జంకులు లేక విడిచిపెట్టినారు. వారి నాయకత్వాన్ని అనుసరించిన వెంకటగిరికుమారరాజాగారు ఇంగ్లండునకు వెళ్లినట్టే వెళ్లి అక్కడ మౌనవ్రతం దాల్చి ఊరకున్నారు—మహానుభావుడు, సర్ కూర్మా వెంకటరెడ్డినాయడుగారు అదే దారి త్రొక్కినారు. సొంతలాభం ముదవలేకపోయినారు. దేశమును వెనుకకు త్రోసివేసివారు; లభ్యమయిన ఒక మంచి తరుణమును బుద్ధిపూర్వకముగా పోగొట్టుకున్నారు. ఒకమాటు తరుణం పోయిన-తరువాత మరల రాదుకదా? ఆంధ్రదేశముపై అముగ్గురు మహానాయకులకు దయ లేక పోయినది. అయితే వారు మాత్రం ఆంధ్రుల ప్రతిభకు, నైజగుణసంపత్తికి ప్రత్యక్షసాక్ష్యము లైనారు. వీరి చర్య అంతా చూస్తూ వున్న ప్రపంచానికి, ఆంధ్రులలో ఐక్యభావం లేదు, దేశం అంటే అభిమానం లేదు; ఆంధ్రునికి ఆరంభశూరత్వము మెండు, కార్యాచరణమందు చాకచక్యము, పట్టుదల, దీక్ష తక్కువ. పసిబిడ్డలాగున కాస్సేపు ఏడ్చి, మళ్లీ యిట్టే అంతా మరచిపోతాడు, ఈఆంధ్రులను ఇట్టే సులభంగా త్రోవతప్పించి నడిపించవచ్చు. అని తోచింది. ఇటువంటి ఆంధ్రనాయకులను జూచి ఆంధ్రులు సంతాపము నొందుచున్నారు. చూచే పైవాళ్ళు అన్న ఆక్షేపణలకు వళ్ళు గగిలిపోతుంది, కాని నిస్సహాయతవల్ల అభిమానం పెచ్చురేగి వళ్లంతా దగ్ధమైపోయి శూన్యత్వం ప్రాప్తిస్తున్నది.

* * * *

అదివరకు చక్కగా సాగుతున్న ఆంధ్రోద్యమము కాంగ్రెసు వెల్లువరావడంతోనే కుంటిదై పోయింది. ఎదుగుతూ ఉన్న మొక్కకు విషవాయువు సోకినట్లయింది. తీగెలుసాగి, పూవులుపూచి, ఫలము లీనవలసినపాదు, కుమిలిపోయి క్షీణించిపోయింది. ఆంధ్రోద్యమమును సాగిస్తూఉన్న దేశీయనాయకులు, కొండా వెంకటప్పయ్య, డాక్టరు పట్టాభి, ప్రకాశంపంతులు కాశీశ్వరరావుగారు నాగేశ్వరరావుగారు మొదలయిన మహానాయకులంతా, కనుచూపు మేరలో స్వరాజ్యం కనబడుతున్నట్లు భ్రమపడి, దేశాభ్యుదయమునకు పునాదివంటి ఆంధ్రోద్యమాన్ని తటాలునవిసర్జించి కాంగ్రెసుఉద్యమంలోనికిఉరికినారు. ఇతర ప్రాంతాలలో కాంగ్రెసు ఉద్యమం ప్రబలినా, అప్పటికి సాగుతూఉన్న మహోద్యమాలు అణిగిపోలేదు. అప్పటి నాయకులు చాలా దూరదృష్టితో కాంగ్రెసు ఉద్యమంతో పాటు వెనుకటి వాటినిగూడా సమంగా నడిపినారు—వాటిలో, కాంగ్రెసుకు ఎక్కడా సంఘర్షణ రానీయలేదు. కాంగ్రెసు వచ్చి రాష్ట్రీయ సమస్యలను త్రుంచివేయ నివ్వలేదు. ఏఉద్యమానికి ఆఉద్యమమును వేర్వేరుగాఉంచి వ్యవహారం చక్కబెట్టుకున్నారు. కాని ఆంధ్రదేశంలో మాత్రం అట్లుగాకపోయింది. కాంగ్రెసు ఉద్యమం ప్రస్తుతంలో పరాజయం పొందడంచేత ఆంధ్రోద్యమానికి కూడా వెన్నెముక విరిగిపోయినట్లయింది. పాకీకేండ్లు కృషిఅంతా బుగ్గియిపోయింది. కాంగ్రెసువల్ల ఆంధ్రదేశానికి ఏమీ ఉపకారం జరుగలేదు. జరిగినదంతా అపకారమే—ఆంధ్రరాష్ట్రము ఎప్పుడైనా వస్తుంది ముందు స్వరాజ్యం సంపాదించాలని సంకుచితమైన, హ్రస్వదృష్టితో పలికిన డాక్టరు పట్టాభిగారి మాటలు చెవులకు ములుకులాగున ఉన్నాయి. ఆంధ్రరాష్ట్రం రాలేదుకదా, స్వరాజ్యంకూడా ఎండమావులలో నప్పితీర్చుకోవడంలాగున అయినది. ఇంకెన్ని సంవత్సరాలు, ఇపుడు పెరిగిన వైషమ్యాలు, కక్షలు మొదలయిన విషవాయువులను సంహరించి ఐక్యభావంతో పనిచేసి స్వరాజ్యం సంపాదించడానికి కావాలీ! ఇదివరకు గాంధిగారు ఒక యేడాదిలో వస్తుందన్నారు స్వరాజ్యం. మొన్న సరోజనీదేవిగారు ఐదేండ్లయినా పట్టుతుందన్నారు. ఐదేండ్లు, ఏభయిఏండ్లు కావచ్చును. ఆంధ్రదేశంవంటి పెద్దరాష్ట్రంలో ప్రజకు వెన్నెముక విరిగిపోయిన తరువాత, దేశాభ్యుదయమునకు అత్యవసరమైన ఆంధ్రోద్యమము వైరిశలలు వేసినతరువాత, తలపెట్టిన ఒక్క ఉద్యమమూ కొంచెమైన ఫలశంతము కాకపోయినప్పుడు ప్రజకు కాంగ్రెసు నాయకులయందు ఏవిధంగా విశ్వాసం ఉంటుంది? కాంగ్రెసు వల్ల ఆంధ్రదేశానికి, తన శక్తిసామర్థ్యములందు అవిశ్వాసం జనించింది. అవిశ్వాసం కలిగినతరువాత, మళ్ల కూడ గట్టుకొని రాగల మహానాయకుడు ఆంధ్రదేశంలో పుట్టు

తాడన్న ఆశ నిరాశకావచ్చును. కాంగ్రెసు ఉద్యమంవచ్చి ప్రజలలో ఓరిమి, పరస్పర విశ్వాసము, జట్టుగూడి కృషిచేయుట మొదలయిన మంచి గుణాలను మంటగలిపివేసింది. కాంగ్రెసు వాళ్లే తమలో, శిక్షణలేదని గోలపెట్టుకున్నారు. కాంగ్రెసువాళ్లలో జెయిలుకు వెళ్లితేనేగాని దేశభక్తుడు అనిపించుకోడానికి అర్హత లేదన్న సంకుచిత మూఢభావం జనించింది. అందుచేత ఇతరులన్నా, యితర ఉద్యమాలన్నా ఈర్ష్య పుట్టింది. అందరానిపండ్లకు అర్రులు చాచి ఉన్నది కాస్తా పోగొట్టుకున్నాడు ఆంధ్రుడు వెనుకటి ఈసపు కథలలో చెప్పిన పేరాసగల కుక్క కథలోవలె. కాంగ్రెసు ఉద్యమం రావడంవల్ల ఆంధ్రుడు ఆంధ్రదేశంలోనే కాదు, బయటకూడా పలుకుబడి గౌరవం పోగొట్టుకొన్నాడు. చివరకు కాంగ్రెసు ప్రెసిడెంటుపదవి కాంగ్రెసుపుట్టి ఏభయి యేండ్లయినా, ఆంధ్రుడికి ఒకమారయినా లభించలేదు. ఇపుడు లభిస్తుందని ఆశకూడా లేదు. చివరకు ఆంధ్రోద్యమం వదిలిపెట్టి, కాంగ్రెసు ఉద్యమం చేపట్టడంవల్ల, ఆంధ్రునికి ఆంధ్రదేశంలోనూ స్థితి లేకపోయింది.

*    *    *    *

. మన ఆంధ్రనాయకులను విమర్శిస్తూ వ్రాసినందులకు నన్ను ఎవరూ తప్పుపట్టకండి. నా అభిప్రాయం తెలుసుకొని తరువాత, నాదోషం ఉంటే కోపం వహించండి—వెనుక ఒకమాటు—వీరేశలింగం, అప్పారావుగార్లను నేను గట్టిగా విమర్శించాను—వాళ్ళు తమ దేశాన్ని, తమ తోడి ఆంధ్రులను నిరసించి, హేళన చేసినారు—వారు వ్రాసిన వ్రాతలకు ఆంధ్రుడు—జాతీయాభిమానం గల ఆంధ్రుడు, పూర్వచరిత్ర కొంతవరకైనా తెలిసిన ఆంధ్రుడు లోలోపల దుఃఖమును మ్రింగినాడు. ఒకమాటు కూకటి వేళ్లతో ఆంధ్రజాతీయాభిమానము, సంప్రదాయములు, గుణసంపత్తి మళ్లీ తలవేయకుండా ఎండిపోయినవి. వారి వ్రాతలతో తప్పులున్నచోట, ఎరిగి దిద్దుకొనే శక్తి, ఉడుకెత్తినట్లు నశించిపోయింది. దేశంలో పూర్వం మంచీ వస్తూ కొనఊపిరితో ఉన్న వెలుగు ఒక్కసారిగా ఆర్పివేయబడినది. ఇపుడు తిరిగి ఆ ఆంధ్రజ్యోతి వెలిగించగల నాయకుడు ఆంధ్రదేశంలో అవతరించేటంతవరకు, మనము ఇపుడున్న రీతిగానే, దైన్యమునందు పొరలాడుతూ ఉండాలి!

*    *    *    *

ఈ ఇరవయ్యోశతాబ్దం ప్రారంభించినప్పటినుంచి, ఆంధ్రునికి ఆంధ్రదేశం పొలిమేరలు దాటి వలసపోయిననాడు గాని భిక్ష పుట్టకపోతున్నది. ఆంధ్రదేశంలో ఉండిపోతే చిత్రావూరి యజ్ఞేశ్వరచింతామణి, ఈద్పుగంటి రాఘవేంద్రరావుగార్లకు పేరుప్రతిష్ఠలు ఎంతవరకూ వచ్చేవో? వారి గొప్పదనము ఆంధ్రదేశం గ్రహించడం లేదు. ఇంకా కొన్ని దశాబ్దాలవరకు గ్రహించలేదని నిశ్చయంగా చెప్పవచ్చును. కుందూరి ఈశ్వరదత్తును చూడండి. చావలి గాను మంతిరావు, కవుతా రామమోహనశాస్త్రి, అతని సోదరుడు, మొదలయినవాళ్లను ఎందరొన్నో చూపించవచ్చును. ఒక పెద్ద జాబితా వ్రాయ నక్కరలేదు. కండ్లువిప్పి, కలయజూస్తే ఆంధ్రభూమిని విడిచిపెట్టి పైకి వెళ్లిన ఆంధ్రుడే పైకి వచ్చి ధృవనక్షత్రంలాగున కనబడుతున్నాడు. ఈ దేశంలో పుట్టి పెరిగి, చచ్చిన ఎంతగొప్పవాడైనా ఈనాటి ఆంధ్రులు—కొన్ని కారణాలవల్ల—మెచ్చుకోజాలకున్నారు. వారి కళ్లకు మశకాలవంటి చిన్న తప్పులు, ఒకరిని బాధించని లోపములు, గోరంతలు, కొండంతలుగా కనబడుచున్నవి. ఈనాడు ఆంధ్రుడు, ఎవరి గొప్పా మెచ్చడు. తన సాటి ఆంధ్రుడు గొప్పవాడవుతున్నాడని సంతోషించి, తాను వీరారాధన చేయుటకు మారుగా, వాడు ఆ గొప్పదనమునుండి, బూడిదలో పడిపోయేవరకు నిద్రపోడు. ఒప్పులు వెదకి, తప్పులుగా చూపించడం ఆంధ్రునికి గిట్టదు. గొప్పదనం—ఎంత ఉన్నా చిన్న చూపుతో చూడడం ఆంధ్రునికి ఎంతో ఉబలాటం కలిగించే పని—ఎందరో ఆంధ్రులు ఈ దేశం విడిచిపోయి పైదేశాలలో పేరు తెచ్చుకొని బ్రతకడంవల్ల, ఆంధ్రదేశానికి రావలసిన ప్రతిష్ఠ, కలగవలసిన భాగ్యము పొందవలసిన ఉచ్చదశ—ప్రాప్తించడం లేదు.

*    *    *    *

ఆంధ్రులవి అసలు మొదట్లో, సంగీతము, నృత్యము, అభినయము మొదలయిన లలితవిద్యలు. వారికవి పూర్వయుగములందు వెన్నతోడ పెట్టినవి. పూర్వాంధ్ర చక్రవర్తుల శాసనములను విలాసంగా చూచినపుడు వారు కవిగాయక కల్పతరువులను బిరుదును గర్వంగా ధరించినట్లు గోచరిస్తుంది. వారు "సకలకళా కోవిదులు". రెండు వేలేండ్లనుంచి ఆంధ్రదేశాధిపులు, నటులను, గాయకులను రావించి పోషించినట్లు చరిత్ర నాకొనుచున్నది. సుమారు నూరు నూటయేబది సంవత్సరములనుండి నాట్యము, అభినయము, సంగీతము మొదలయిన విద్యలన్నీ ఆంధ్రభూమిలో అంతరించిపోయినవి. కూచిపూడి భాగవతులు, సంగీతపాటకులు, నటులు వస్తే వారిని సత్కరించి వారి విద్యను పోషించడానికి మారుగా, వారిని, వారి విద్యను కూడా హేళన చేసి నిరసించినారు ఆంధ్రులు. ఆంధ్రదేశంలో నేడు ఆంధ్రులకు—ఆంధ్రదేశపు లలితకళలకు నివాసం లేకుండాపోయింది. భరత నాట్యము, అభినయము సంగీతము మొదలయినవి పరిసరప్రాంతములందు తల దాచుకొనుటకు పారిపోయినవి. పూర్వము ఆంధ్రదేశంలో ఈకళోపాసకులు ఏవిధంగా తమ విద్యలను ప్రదర్శించి, ప్రజల హృదయముకు ఆనందము కలుగజేసేవారో, వారి విద్య ఎట్టిదో, స్వరూపము కాదు కదా, మచ్చుకు కూడా మనకు నేడు కరవైపోయింది. ఈదుస్థితి తలచుకుంటే అశ్రుకణములు దొరలుతవి. ఆంధ్రుల విద్య అంతా అరవలు పోషించుకుంటూ ఆదరము చూపిస్తున్నారు. తిరిగి మన విద్యలను మనము అలవరచుకొని, మన దేశానికి కొనిపోతామేమో అన్న భయం చూపించి, మనలను దగ్గరకు రానీయకుండా ఉన్నారు. ఆంధ్రుల సంగీతము, భరతనాట్యము, ఆంగికాభినయము పూర్వం ఆంధ్రభూమిలో ఏలావుండేవో చూపించేవారు ఇప్పటికి తమిళనాడులో ఉన్నారు. తంజావూరు జిల్లాలో కావేరినది పారే సీమలలో మేలత్తూరు, శూలమంగళం ఉత్తుకాడు మొదలయిన గ్రామాలలో ఈ విద్యలన్నీ కూచిపూడిలో వర్థిల్లినట్లే

నేటికి కూడా ప్రవర్ధమానంగా పెరుగుతూ ఉన్నవి. అక్కడ ఉన్న అరవవారికి తమ అరవంమీదకంటె, సంగీతానికి నెలవయిన ఆంధ్రం మీదనే అభిమానం మెండు—అక్కడ భాగవతులు, కథ—కలాపం అంతా ఆంధ్రంలో వినిపిస్తారు. ఆంధ్రంలో సంగీతం పాడుతారు. ఆంధ్రంలోరచించిన దరువులుపాడుతూ, నృత్యంచేస్తూ, అభినయం, చేస్తూ నాటకములాడుతారు. మనమిక్కడ, మనదేశంలో అసహ్యించుకోవడంవల్ల, వీధినాటకములు, భాగవత కలాపములు, మొదలయినవి శల్యగత ప్రాణములతో ఉంటున్నవి. వీటిమీద విద్యాధికుల మనిషిగ్రహీగే, గ్రుడ్డివారికి ఆదరం లేదు. చివరకు అవి ఎలావుంటవో, అని చూద్దామనే ఉబలాటమే లేదు.

*　　　*　　　*　　　*

ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం రాకపోయినా, అట్టిది కొంతకాలం దాకా రాకుండా వుండడానికి ఆంధ్రయూనివర్శిటీ అడ్డుతలిగి కూర్చున్నది. యూనివర్శిటీ వచ్చిన తరువాత ఆంధ్రులకు ఏమీ ఉపకారం జరిగిలేదు. ఉపకారం లేకపోతే మానిపోయెను, అపకారం మాత్రం జరిగింది. క్రొత్తనీరు వచ్చి ప్రాతనీటిని కొట్టేసినట్లు, ఆంధ్రయూనివర్శిటీ వచ్చి, కలుగుతూ, ఏర్పడుతూ ఉన్న ఆంధ్రుల ఐకమత్యమును కుకుటిలోనికి త్రుంపివేసినట్లు చేసింది. తిరిగి ఆంధ్రదేశంలో ఉభయప్రాంతాలవారికి ఐక్యభావము కుదిరే చిహ్నాలు ఏమీ గోచరం, కావడం లేదు. కనుకనే, యూనివర్శిటీ ఏర్పడడం వల్ల కలిగిన అపకారం సవరింపబడాలి—ప్రస్తుత పరిస్థితులు దాని కేమీ తోడ్పడవు. ఆంధ్రదేశం ఈ విధంగా విభజింపబడి, ఆంధ్రులు ఈవిధంగా ఐక్యభావము లేక అల్లాడుతూ ఉండుమని విధాత రాసిన కనబడుతున్నది. ఆంధ్రదేశ విభజనము, వంగదేశవిభజనము వంటిది కాదు. వంగదేశీయులకు స్వజాత్యభిమానము, స్వదేశాభిమానము తలమునకలుగా ఉన్నాయి. ఆంధ్రులకు ప్రగల్భాలు కొట్టినంతగా దీక్ష లేదు—దేనికైనా హృదయాంతరాళంలకు పట్టుకలనాటుకొననీయరు ఆంధ్రులు. తమలో ఉన్న లోపము తెలుసుకొని తప్పు దిద్దుకొను—ఆంధ్రయూనివర్శిటి మాట వచ్చింది కాబట్టి అను కోవలసివచ్చింది. ఆంధ్రయూనివర్శిటీవల్ల, ఆంధ్రదేశానికి లాభం కలుగలేదంటే దృష్టపడానికి ఉదాహరణాలు చాలా ఉన్నవి. మొదటిది ఆంధ్రులకు ఏమీ ఉపకారం జరుగలేదు. ఇప్పుడు దక్షిణాన మళయాళీలు, ఉత్తరాన అస్సామీలు తమకు ఒక ప్రత్యేక విశ్వవిద్యాలయము కావలెనని గోలపెట్టుతున్న దెందులకు? తమ భాష అభివృద్ధిపొంది, తమ ప్రత్యేక జాతీయత ఏర్పడి, వృద్ధిపొందవలెననే కదా! ఆమాటలు వారు ఘంటారవం వలె చెవులు గింగురుమనేటట్లు చెబుతున్నారు. అలాగే ఓఢ్రులు మహారాష్ట్రులు కూడా ప్రత్యేక విశ్వవిద్యాలయాలు కోరుతున్నారు. వారందరు తప్పకుండా విశ్వవిద్యాలయాలు సంపాదించుకొనవలసినదే! కాని ఆంధ్రయూనివర్శిటీవంటిది మాత్రంవద్దు. దేశభాష, దేశచరిత్ర అంటే అభిమానం చూపించే యూనివర్శిటీ అయి యుండాలి. వారిపుడు ప్రకటిస్తూ యున్న ఆశయములను ఆచరణలో పెట్టగలిగే యొడల అన్ని విధములచేతను కేరళయూనివర్శిటీ అస్సాము యూనివర్శిటీలు తప్పకుండా ఆంధ్రయూనివర్శిటి కంటే చాలా బాగా వర్ధిల్లగలవు దేశాభ్యుదయమునను తోడ్పడగలవు. మన ఆంధ్రయూనివర్శిటీ నెలకొల్పబడిన తరువాత స్థాపింపబడిన అణ్ణామలై యూనివర్శిటీ తమిళభాషను అభివృద్ధిపరచి, తమిళచరిత్రను ఉద్ధరించి తమిళప్రతిభను, తమిళుల ఔన్నత్యమును తమిళప్రజకు చాటి చెప్పవలయునను సంకల్పముతో పనిచేయుచున్నది. మద్రాసు విశ్వవిద్యాలయము కూడా అంతే. ఆంధ్రంమీద మద్రాసు విశ్వవిద్యాలయమునకు కొంచెమైనా అభిమాన మున్నది. తమిళనిఘంటువు (టమిల్ లెగ్జికను) లాంటిది ఆంధ్రమునకు వ్రాయించడానికి పూనుకొనకపోయినప్పటికి, ఆంధ్రభాషకు ఆంధ్రవాఙ్మయమునకు పరిశోధన కొంత ఆవశ్యక మని యెంచి అందుకు తగిన పండితబృందమునైనా ఏర్పాటు చేసింది. అటువంటి మాట ఆంధ్రయూనివర్శిటీలో స్మరించరాదు. పైకి అంటే మహాపాతకం కూడాను. పైవారిక కోపం వస్తుంది. బిడ్డపాప లెరుగని గొడ్రాలికి పసిపాపలపై ఎంత ప్రేమ వుంటుందో, ఆంధ్రయూనివర్శిటీకి ఆంధ్రభాషపై అంత ప్రేమ ఉన్నది! ఈ మధ్య, ఒకమారు, ఆంధ్రయూనివర్శిటీ పోషకు లయిన శ్రీజయపురం మహారాజావారు, శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు, ఆంధ్రంలో స్వతంత్ర మైన కవిత్వము, వాఙ్మయము, మొదలయినవి ఏమీ లేవని నిరసించినారు. వారు ఓఢ్రులు; ఆంధ్రపండితులని కవులని ప్రఖ్యాతి గాంచినవారు. వారన్నది, అవునో కాదో చెప్పడానికి ఆంధ్రయూనివర్శిటీకి తాహతు లేకపోయింది. ఆంధ్రులకు ఆంధ్రాభిమానం ఉంటే కదా! యూనివర్శిటీ కలిగిస్తే కదా!

ఆంధ్రయూనివర్శిటీకి ముందు భాండాగారము. అందుకు ఆంధ్రభాష అభివృద్ధిపొందించడానికి వీలయిన గ్రంథములు అందులో ఏమీ లేవు. ఆంధ్రభాషకు ఏమి గ్రంథములు అవసరమో తెలియడానికి, తెలిపితే తెలుసుకోడానికి యూనివర్శిటీ లైబ్రేరియను ఆంధ్రుడైతే గదా! ఆంధ్రదేశంలో, ఆంధ్రులలో ఆ పదవికి తగిన పండితులు లేరన్నట్లు పైనుంచి తెచ్చుకున్నాము. ఆంధ్రునకు ఆంధ్రదేశంలో ఆదరణ ఏది! ఆంధ్రభాషకు ఒక రీడరు పరిశోధనకు ఒక పరిశోధనశాఖ కరవుగా నున్నది. ఇపుడున్న లెక్చరర్లకు పండితులకు భాషావిషయక పరిశోధనకు అవకాశములు లేనేలేవు. ఆంధ్రభాషాపరిశోధనకు సాధనము లయిన పాలీ, ప్రాకృత, సంస్కృతాదిభాషలకు ఆంధ్రయూనివర్శిటీలో పండితులు లేరు. ఉపాధ్యాయులు లేకపోయినప్పుడు, విద్యార్థులు ఎక్కడనుండి వస్తారు! ఉపాధ్యాయులు, పండితులు ఉండి పరిశోధన చేస్తూ ఉన్ననాడు, ఆంధ్రయూనివర్శిటీ పేరు సార్థక మవుతుంది. బహుశః యూనివర్శిటీ అధికారులకు ఆంధ్రంమీద అభిమానం లేదు కాబోలు! వారు ఆంధ్రులుగారో! ఆంధ్రభాషమీద ఎంత నిరభిమానమో ఆంధ్రచరిత్ర దక్షిణదేశచరిత్రములపై కూడా అంత అనాదరణమే! ఇతరవిశ్వవిద్యాలయములు, వాటిలో ముఖ్యములయినవి; కలకత్తా, అలహాబాదు, లక్నో, బొం

శాయి, ఢక్కా, మద్రాసు, మైసూరు, పంజాబు, బెనారసు హిందూయూనివర్సిటీలు, హిందూదేశచరిత్ర, అందు ముఖ్యముగా పరిశోధింపవలసియున్న దక్షిణదేశముల చరిత్ర, ఆంధ్రదేశచరిత్రలకు ప్రాముఖ్యము నిచ్చి, వాటి పరిశోధనల నిమిత్తము పండితు లయిన వారిని రీడర్లగా నియమించి కృషి చేస్తూ ఉంటే, ఆంధ్రయూనివర్సిటీ ఆంధ్రదేశచరిత్ర, భరతఖండచరిత్ర యందు మరుపునకు రాని—ముమ్మారు మహాసామ్రాజ్యములను నిర్మించిన మహాంధ్రజాతియొక్క చరిత్రను బోధించుటకు గాని, పరిశోధన చేయుటకు గాని ఏర్పాటులు చేయలేదు.

ఆంధ్రయూనివర్సిటీ అధికారులకు ఇది తోచలేదో? తోచినచో ఇట్లేల యుపేక్ష, ఔదాసీన్యమును చూపింతురు? ఆంధ్రభాష అన్నా ఆంధ్రదేశచరిత్ర దక్షిణదేశచరిత్ర లన్నా, ఆంధ్రయూనివర్సిటీ అధికారులకు సవతితల్లి ప్రేమ. ఇది చాలా దుస్సహ మైన విషయము. దుఃఖకరమును, సంతాపకరమును కూడాను. కాని ఆంధ్రుల మొఱ ఆలకించే దైవం లేడా?

* * * * * *

ఈ మధ్యను ఆంధ్రయూనివర్సిటీ వారు ఎకనామిక్సు, పొలిటిక్సు ప్యూర్ కెమిస్ట్రీ, అప్లయిడు కెమిస్ట్రీలు బోధన చేయుటకు నలుగురినో, ఇద్దరినో ఆచార్యులను (ప్రొఫెసర్లను) పెద్దపెద్ద జీతాలనిచ్చి నియోగిస్తారని తెలియుచున్నది. ఈ పెద్ద యుద్యోగాలకు ఆంధ్రులలో పండితులు, పైప్రాంతాలవారికి ఏమాత్రము తీసిపోని పండితు లుంటే, వారిని, ఏర్పాటు చేస్తారేమో చూడవలసియున్నది. అలాగున చేయని నాడు ఆంధ్రునకు ఆంధ్రాయూనివర్సిటీవల్ల మోక్షము లేదన్న మాట!

మనదేశంలో ఉన్న సంస్థానము లన్నింటిలో వెంకటగిరి, విజయనగరములు పెద్దవి; పిఠాపురం మొదలయినవి కూడా ఉన్నవి. వెంకటగిరి, విజయనగరములు స్వదేశసంస్థానము లయి, స్వపరిపాలనము అనుభవిస్తూ ఉంటే ఆంధ్రదేశానికి కొంత లాభం ఉండేది—ఆంధ్రుల ప్రతిష్ఠ, ప్రాచీనసంప్రదాయములు, ఔన్నత్యము, కొంత వఱకైనా మనకు కంట్లయెదుట కనిపిస్తూ ఉండేది. కన్నడులకు మైసూరు ఉన్న దంటే, దానిలాభం ఎంత ఉన్నదో, ఆంధ్రుడు ఒకసారి మైసూరు రాజ్యం, కన్నడదేశం తిరిగి చూచిరావలెను. అప్పుడు గాని ఆంధ్రదేశంలో స్వపరిపాలనము గల సంస్థానములు ఉంటే వచ్చే ఫలము బోధపడదు—మళయాళీలు ఇంత పైకిరావడం కొచ్చి, తిరువాన్కూరు రాజ్యము లుండుటబట్టె యని అక్కడకు వెళ్లి చూచి వచ్చిన వారు చెప్పగలరు. ఈవెంకటగిరి, విజయనగరములు, స్వపరిపాలనము గల సంస్థానము లయి యుంటే, ఆదాయమునందు, వైశాల్యమునందు, భాగ్యసంపత్తియందు, ఇందూరు, బరోడా, తిరువాన్కూరు సంస్థానములతో సరిసమానమైన పదవి నందియుండేవి. ఆంధ్రులకు ఆభాగ్యం ఆదిలోనే లేకుండా పోయింది. కాని ఉన్న భాగ్యం కూడా అనుభవించడానికి ఆంధ్రుడు నోచుకోలేదు—ప్రత్యేకాంధ్రరాష్ట్రము, ఆంధ్రనగరము లేకపోవడంచేత ఈసంస్థానాధిపతులు తమ డబ్బంతా ఇతరరాజధానినగరాలలో ఖర్చుపెట్టి, ఆంధ్రదేశానికి సౌభాగ్యము మరింత దూరం చేసేస్తున్నారు. విజయనగరం మహారాజా—ఇప్పుడు పదచ్యుతు డైనాడు—, కాని పదవి ఉన్ననాడు దేశంమాట గాని, తన సంస్థానము యొక్క పూర్వపు సంప్రదాయముల మాట గాని, ఔన్నత్యము గాని ఒకనాడు తలచుకోలేదు. భగవంతు డిచ్చిన ఐశ్వర్యమును, పదవిని, దేశంకోసం, తమకోసం సద్వినియోగం చేసుకొని కీర్తిని సంపాదించుకోడానికి ఆంధ్రదేశంలో పుట్టిన శ్రీమంతులు పెట్టిపుట్టలేదు. విజయనగరమహారాజకుమారు లైన శ్రీపూసపాటి కుమారఆనందగజపతిమహారాజా లుంగారు ఆంధ్రదేశపు సంస్థానాధీశు లైనను ఆంధ్రదేశంలో, తనకు మిక్కిలి ప్రియతమమైన క్రికెట్టుఆటనుపోషించడు. ఆంధ్రదేశంలో జీవం కూడా కళతో పాటు శుష్కించిపోతూ ఉన్నది.

* * * *

ఇంతెందుకు! ఆంధ్రదేశంలో ఒక ఆంధ్రదైనికపత్రికకు కంటె, ఎక్కువ పత్రికలకు తావు లేకుండా ఉన్నది. వారపత్రికలు, మాసపత్రికలు ఉన్నాయంటే ఏవో ఒకటిరెండు పత్రికలు మినహాయిస్తే మిగిలినవాటికి దినదినగండము దీర్ఘాయువు అన్నట్లున్నది. ఒక అణా చొప్పున ఇచ్చి, ఎన్ని మారు లైనా కాఫీ కప్పులు త్రాగును కాని చదువుకున్నవాడ నని గర్వపడే ఆంధ్రుడు, సొంతానికి ఒక అణా ఇచ్చి ఒక ఆంధ్రపత్రికను కొని చదవడు. అతని కది అవమానంగా వుంది. కాని ఆంధ్రమును ఈసడించుకొని, హిందీని చూచి మురిసిపోతున్నాడు.

* * * *

వేయిమాట లెందుకు? ఎటుచూచి నాఆంధ్రులకు ఆంధ్రదేశంలో యోగం పట్టడం లేదు. భాషాభివృద్ధి, జాతీయాభివృద్ధి కూడా కనుబొమలమీది వెంట్రుకలవలెనే ఎదుగు బొదుగు లేకుండా ఉన్నాయి. ఇంతకీ చెప్పవలసిన మాట ఆంధ్రునకు ఆంధ్రదేశంలో భిక్ష పుట్టడం లేదు!

## విరాళములు

ఈ నెలలో ప్రబుద్ధాంధ్రను సత్కరించినవారు

| | | |
|---|---|---|
| ౧ | శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు ఆంధ్రభారతీపత్రికల అధిపతులు మదరాసు | ౨౫-౦-౦ |
| ౨ | శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు త్రిలింగ, ఫెడరల్ ఇండియాపత్రికల సంపాదకులు-మదరాసు | ౧౦-౦-౦ |
| 3 | శ్రీ వెమునమూడి వేంకటకృష్ణారావుపంతులుగారు గవర్న మెంటు తెనుగు ట్రాన్సులేటరు మదరాసు | ౫-౦-౦ |
| ౪ | శ్రీ క. రామనాథంపంతులుగారు బి. ఏ. మదరాసు | ౫-౦-౦ |
| ౫ | శ్రీ జి. భాస్కరరామచంద్రరావు పంతులుగారు ఉలవభద్ర ప్రొప్రయిటరు. పర్లాకిమిడి | ౫-౦-౦ |
| ౬ | శ్రీ కంభంపాటి సత్యనారాయణగారు లాండులార్డు అవిడిగ్రామం | ౫-౦-౦ |
| ౭ | శ్రీ క. సూర్యనారాయణగారు మద్రాసు | ౫-౦-౦ |

# చిన్నయసూరి ప్రయోగ విమర్శనము

గిడుగు వేంకటసీతాపతిగారు—బి. ఏ. ఎల్. టి

"ఉదయిని" సంపుటము ౧. సంచిక ౪ లో "శృంగాటక" మనే శీర్షికక్రింద విమర్శకు లెవరో కొన్ని విషయములు ముచ్చటిస్తూ,

"చిన్నయసూరి పాండిత్యం ఆక్షేపణకు పాత్రమయింది. వ్యాకరణదోషమే దొరికిందట—అట! "వినోదిని" (ఈ ఆగస్టుసంచిక) సమాలోచనలో 'నీతిచంద్రిక' తొలివాక్యం చిన్నయసూరికి అప్రతిష్ఠ తెచ్చింది; "గంగాతీరమున సకలసంపదలు కలిగి పాటలీపుత్రమను నగరము కలదు." అని ఆవాక్యము. "కలిగి" అన్వయం "చిన్నయ్యా అయినా చెప్పలే" డనుకొన్నారు. భారతములో "కరుణకలుగుమమ్మ కమలనేత్ర" (అది. ౮. ఆ.), "అంతయెఱుక లేని" (అర. ౧. ఆ.) అన్న సందర్భాలలో 'కలుగు' సకర్మకంగా కట్టి శబ్దరత్నాకరకారుడు అన్వయం చెప్పి ఉన్నాడు. దీనికీ చిన్నయ్యను పిలువనక్కఱలేదు. మొదటి 'కలిగి' అన్నప్పుడు సకర్మకంగాను, 'కలదు' అన్నప్పుడు అకర్మకంగాను గుర్తించినప్పుడు చిన్నయ్యా, మరి పెక్కుమందీ శాంతిచెందినవా రవుతారు." అని వ్రాసినారు.

గాని, ఇంతమాత్రాన శాంతి కుదిరే విషయం కాదది. ప్రాచీనాంధ్రభాషవిషయములన్నిటను చిన్నయసూరిగారి నీతిచంద్రికా బాలవ్యాకరణములున్ను, శబ్దరత్నాకరమున్ను ప్రమాణముగా పండితులందరున్ను గ్రహిస్తున్నారని గాని గ్రహించవలెనని గాని చెప్పడానికి వీలులేదు. ఈ 'కలుగు' విషయమై వ్రాయవలెనంటే ఒక పెద్దవ్యాసము వ్రాయడానికి అవకాశమున్నది. దీనిని గురించి సవిస్తరముగా వ్రాయవలెనని మా తండ్రిగారు, రావుసాహెబు గిడుగు వెంకటరామమూర్తిపంతులుగారు ఆలోచించినారు గాని, ఇప్పుడు మఱియొక పనిలో నిమగ్నులై ఉండడమువల్ల వ్రాయలేదు. నాకైనా తీరుబడిలేదు గాని ఈవిషయము చర్చకు వచ్చినది గనుక, దీనికి సంబంధించిన ముఖ్యవిషయములు సంగ్రహించి తెలియజేస్తున్నాను.

కలుగు ధాతువు సకర్మకము కాదని కీ. శే. వేదము వెంకటరాయశాస్త్రులువారి మతము.

శ్రీనాథుని శృంగారనైషధమునకు తాము వ్రాసిన సర్వంకషావ్యాఖ్యలో సప్తమాశ్వాసమున తొమ్మిదవ పద్యమందున్న "పరిజనులమీఁదఁ గరుణగలుగుము" అనే వాక్యమునకు అర్థము చెప్తూ, "కరుణగలుగుము=దయగలిగియుండుము" అని వ్రాసి, "కలుగు" ధాతువు అకర్మకమా సకర్మకమా అనే విషయము చర్చించి, శాస్త్రులువారు తమ అభిప్రాయము ఎట్లు తెలియజేసినారో చూడండి:—

"'కరుణగలుగు'—కలుగు ధాతువునకు 'పొందు' అను నర్థమనియు నాయర్థమున నది సకర్మమనియు తెలిపి సీతారామాచార్యులవారు 'కరుణగలుగుము' అని యుదాహరణ మొసంగినారు. అది కరుణగలిగియుండుము' అనుటకే శబ్దపల్లవకల్ప ప్రయోగవిశేషమనియు ధాతువు సకర్మము కాదనియు మదీయాభిప్రాయము; వారు ఈయర్థమునకు వ్యుత్పత్తి లేకమునందు చూపిన ప్రయోగము 'లేని' యనునది అన్యార్థమునకు బాలవ్యాకరణమున చెప్పినట్టిదే; సకర్మమనుచో 'వాఁడు నలువురు పుత్త్రులను గలిగెను', 'వానిచే ధనధాన్యములు కలుగఁబడినవి' అని యిట్టి యనిష్టప్రయోగపరంపరను సాధువుగా నంగీకరింపవలసి వచ్చును. అదియు నిష్టాపత్తియయేని, 'సుఖంబుండు', 'నింపోలగంబుండు', 'కొలువుండు' ఇత్యాదులంబట్టి 'ఉండు' ధాతువును 'పొందు', 'చేయు' అను నర్థంబులతో సకర్మకంబు చేసి 'అతఁడు నలువురు పుత్త్రులనుండెను', 'వానిచే నలువురు పుత్త్రులు ఉండఁబడిరి' ఇత్యాది ప్రయోగములను సయితము అంగీకరింపవలసి వచ్చును; వీనియందు 'సుఖముగా', 'ఓలగంబుగా', 'కొలువుగా' అని యున్నమేని ప్రకృతవాక్యమునకు 'కరుణగా' (కలుగుము—ఉండుము) అనియే యర్థము కావచ్చును. కావున సకర్మకత్వమనేమ సమ్మతము కాదు."

ఈ శాస్త్రులవారే ఆంధ్రసాహిత్యపరిషత్తునాఁటి యుగమవార్షిక సమావేశసమయమున సభాధ్యక్షులయి చదివిన ఉపన్యాసములో (చూ. ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక సంపుటము ౯ సంచిక ౧, ౨— పుట ౮౭) ఈ విషయము ఎట్లు చర్చించినారో చూడండి:—

"I have a house" అను వాక్యమునకు తెనుఁగు చెప్పు శిశుబోధకుఁడు తొట్టతొలుత కలుగు ధాతువును సకర్మకముగా గావించినాఁడు. 'I=నేను, a house=ఒక యింటిని, have=కలిగియున్నాను' యనని యుపదేశము. ఆసంప్రదాయమున సకర్మకత్వము నాటకొంతము వ్యాపించినది. ఆధునికవాఙ్మయమునుండి ఎన్ని ప్రయోగములైనను యుదాహరింపవచ్చును. పాఠ్యపుస్తకములలోను సమృద్ధిగానే కలవు. మూఁడవతరగతి పాఠపుస్తకమున [Third Class Reader-Marsdens] ౨౪ వ పుట "కిటికీలను గొన్ని కిటికీలను గొన్ని పోగులమే కలవై యుండును."

ఈ వాక్యము మార్స్డెన్ గారి మూడవ వాచకములో "ఆరోగ్యమార్గము; ఇండ్లు "అనే ౨౪ వ పాఠములోనిది. ఈవాచకము రావుబహదూర్ కం. వీరేశలింగము పంతులుగారిచేత సరిచూడఁబడినది." "సకర్మకత్వము నాటకొంతము వ్యాపించినది" అని ఇక్కడ వ్రాసినప్పుడు నిజము శాస్త్రులవారికి జ్ఞప్తియందున్నది. వీరేశలింగము పంతులవారు ఆంధ్రీకరించిన అభిజ్ఞానశాకుంతలములోని ప్రయోగమే. "ఆంధ్రకాళిదాసుల గ్రంథములనుండి" అని చూపించిన దోషములలో శాస్త్రులవారు "రక్షకునిఁ గలవాఁడ" అనే ప్రయోగము కనిపెట్టి, "కలుగుధాతువు ఇట్లు సకర్మకముగుట Have ధాతువు నజ్ఞానకృత దోషము" అని వ్రాసినారు. శాస్త్రులవారి ఉపన్యాస మంతా వీరేశలింగము పంతులవారి పాండిత్యలోపమును కనఁగచుటకే ఉద్దేశింపబడినట్లు పంతులవారి పేరు చెప్పకపోయినా పంతులవారి గ్రంథములనుండి ప్రయోగములు ఎత్తి చూపించుట చేత స్పష్టమయినది.

రాఘవ పాండవీయమందలి (ఆ. ౧. ప. ౧౪) "నెలకొనియె వేంటతేమి నబ్బలియుండు శిశిరనగరుచిర పరిసర మహిమంగల..." అనే పద్యములో 'మహిమన్‌గల' అనగా 'మహిమను గలిగినట్టి' అని ముద్దరాజు పెదరామన 'కలుగు' సకర్మకముగా చెప్పిన అర్థము విమర్శిస్తూ ఈ శాస్త్రులవారే తమ "విమర్శ వినోద" మనే గ్రంథములో (చూ. పు. ౫౬) "ఇటు నీ వ్యాఖ్యాత రామాయణార్థమందు అనావశ్యకముగాను, అశాస్త్రీయముగాను కలుగు ధాతువును సకర్మకముగా అన్వయించినాడు" అని వ్రాసినారు.

కీ. శే. కొక్కొండ వేంకటరత్నము పంతులవారు రచించిన ఆంధ్రప్రసన్నరాఘవమును తాము విమర్శిస్తూ ప్రకటించిన గ్రంథములో ఈ శాస్త్రులవారే పంతులవారు కలుగుధాతువు సకర్మకముగా ప్రయోగించిన వాక్యము లాయాచోట్లను విమర్శించి ఆక్షేపిస్తూ "విషయసంగ్రహాదికి" మనే కొసపటిభాగమందు (చూ. పు. ౩.) ఈ ప్రయోగములన్నీ పేర్కొన్నారు. వాటిలో నాలుగింటిని మాత్రమే ఏత్తి శాస్త్రులవారు వ్రాసినది చూపిస్తున్నాను:—

"శోభమునన్ నాయుంగల—అకర్మకధాతుయోగమున కర్మద్వితీయ యెట్లుకలుగును!" (చూ. ఆంధ్రప్రసన్నరాఘవవిమర్శనము పు. ౩౭) "పుంకము గలద"—అకర్మకధాతువును అర్థబోధకముగు సకర్మకముగా జేయుట! ఇదేగావలయు కవితాతత్త్వము యొక్క పిత్తు!" (చూ. పు. ౧౧౩) "శోభగల—కలుగుధాతుయోగమున ద్వితీయ నిడు పాశమేలకో తెలియలేదు" (చూ. పు. ౧౯౬)

"ప్రయోగమ్యత్వం గల్గగ—ఇందు పాఠపూరణను వచ్చినదా! కల్గుధాతు సకర్మకతాకారమా!" (చూ. పు. ౨౨౧) కలుగు ధాతువు సకర్మకమనుటకు తగిన ప్రమాణము శబ్దరత్నాకరములో కనబడదు. అందులో సకర్మకమైన 'కలుగు' కు 'పొందు' న్ను, 'పొందు' కు, 'ప్రాపించు' న్ను, 'ప్రాపించు' కు 'పొందు' న్ను సమానార్థములుగా ఉన్నవి. 'పొందు' కు ప్రయోగము 'తెలపెట్టు' క్రింద చూడవలెనని ఉన్నది. అక్కడ చూడగా "కీర్తిపొందెదు విన్నున్" (భాగ. కిష్కి. ౩) అనే ప్రయోగము కనబడినది. 'కలుగు'న్ను పొందున్ను సమానార్థము లయినప్పుడు "కీర్తికలుగును విన్నున్" అనే ప్రయోగముకూడా సాధుగనవలసివస్తుంది.

ప్రాచీనాంధ్రభాషలో సకర్మకమైన 'పొందు' ఈ రీతిగానే చాలాచోట్ల ప్రయుక్తమై ఉన్నది:—

"ఉరగభయము పొందదు జనులన్" (భార. ఆది. ౨. ౨౩౭.)

"పొందవు దుఃఖముల్, భయముపొందదు, పొందదు దైన్యమెన్నయుం

బొందవు తీవ్రదుర్దశలు; పొందు ప్రియంబులు, పొందు సంపదల్

పొందు సమగ్రసౌఖ్యములు పొందు సమున్నత కీర్తు లెందు గో

వింద సదావింద పదపీఠ రిండ్ గరిష్ఠచిత్తులన్"

(శంభుదాసుని లక్ష్మీనృసింహావతారకథ ఆ. ౨. ప. ౩౧.)

ప్రాచీనాంధ్రమందున్న ఈ వాగ్వ్యవహారము అధునికాంధ్రమందు లేదు. ఇప్పుడు 'నేను ఆనందమును పొందినాను' అనేకాని, 'ఆనందము నన్ను పొందినది' అని వాడుక లేదు. ఈ రెండువాక్యములలో దేనియందైనా 'పొందు'కు మారుగా "కలుగు' నిలిపి వాక్యము రచించినయెడల ఆ వాక్యము నేటి వాగ్వ్యవహారము ననుసరించి యుండునా? 'నేను ఆనందమును కలిగినాను; ఆనందము నన్ను కలిగినది' అని ఎవరును అనరుగదా! "వానికి నలుగురు పుత్త్రులు కలిగిరి" అనవచ్చునుగాని; "వాడు నలుగురు పుత్త్రులంగలిగెను" అనిగాని, "వానిని నలుగురు పుత్త్రులు కలిగిరి" అనిగాని అనరాదుగదా!

"కరుణ గలుగు మమ్మ" అనగా 'కరుణ కలిగి ఉండుము, కరుణ గల దానవు కమ్ము' అని అర్థము. 'వాడు కరుణ గలడు' అంటే 'వాడు కరుణ గలవాడు' అని అర్థము. "వాడు కరుణ గలవాడు' నేను కరుణ గలవాడను" మొదలైన వాక్యములలో 'గల' కు మారుగా 'ఉన్న' ప్రయోగించవచ్చును. వీటిలో 'కరుణ' కర్తయగును గాని కర్మ కాదు.

కలుగు ధాతువు సకర్మకముగా సైతము ప్రయోగించవచ్చునన్న వాదము నెగ్గినా, ఇప్పుడు మనము విమర్శిస్తూఉన్న చిన్నయసూరిగారి వాక్యము అన్వయశుద్ధి చెడిన వాక్యమని చెప్పకతప్పదు. ఈ వాక్యములోని దోషము కలుగు ధాతువు సకర్మకముగా ప్రయోగించుటవల్లనే కలిగినది కాదు. ఈ వాక్యరచన ఆంధ్రవాగ్వ్యవహారమునకు— (ప్రాచీనాంధ్ర వాగ్వ్యవహారమునకు గాని, అధునికాంధ్ర వాగ్వ్యవహారమునకు గాని) విరుద్ధముగా ఉన్నది. వాక్యాంతమందున్న 'కలదు' భూతభవిష్యద్వర్తమానకాల వికల్పలేని తద్ధర్మార్థక క్రియ. కాలవికల్పగల క్త్వార్థక క్రియతో దీనికి అన్వయము కుదురదు. "గంగాతీరమున సకల సంపదలంబొంది పాటలీపుత్రమను నగరముగలదు" అని రచించినా అన్వయశుద్ధి చెడుతుంది. ఈ విధముగానే అన్వయశుద్ధి చెడిన వాక్యము మరియొకటి చిన్నయసూరిగారి నీతిచంద్రికనుండే ఎత్తి చూపిస్తున్నాను.

దీర్ఘకర్ణమనుపిల్లి జరద్గవమను గద్దతో చెప్పిన మాటలలో నొక వాక్యము:—

"మిమ్ము ధర్మజ్ఞులని మంచివారని యిచ్చటి పక్షులప్పుడప్పుడు ప్రశంసింపంగా విని, బహుదినములనుండి వీరికి మీదర్శనము చేయవలెనని కోరికగలదు."—ఇందులో పైనిచెప్పిన దోషమే కాక మరియొక దోషముసైతము కలదు. వాక్యమందలి క్త్వార్థక క్రియకున్ను ప్రధానక్రియకున్ను కర్త ఒక్కడై ఉండడము సహజమైన వాగ్వ్యవహారము. ఇంగ్లీషుభాషలో సైతము వాగ్వ్యవహారము ఈరీతిగానే ఉంటుంది. "Having heard that the train arrived, my car was sent to the Railway station" అంటే వాక్యము దుష్టమవుతుంది.

పైని చూపించిన చిన్నయసూరిగారి వాక్యములో క్త్వార్థక క్రియకు కర్త 'నేను' (లోపించినది); ప్రధానక్రియకు కర్త "కోరిక"; కనుక అన్వయశుద్ధి చెడినది.

"చెట్టుపడి నలుగురు చచ్చిరి" వంటి వాక్యములు వాగ్వ్యవహారమందు లేకపోలేదు. ఇందులో 'పడి' అనే క్త్వార్థకమునకు 'పడుటచేత' అని అర్థము. చిన్నయసూరిగారి వాక్యములోని 'విని'కి సైతము 'వినుటచేత' అని అర్థము చెప్పి వారి వాక్యము నిర్దుష్టమనరాదా అని కొందరు ప్రశ్నించవచ్చును. గాని, రెండు వాక్యములున్ను సమానమైన అన్వయముగలవి కావు. 'కలదు' అనే క్రియభూతభవిష్యద్వర్తమానకాలవివక్షగాని కార్యకారణవివక్షగాని లేని కేవల తద్ధర్మార్థకక్రియ. చిన్నయసూరిగారి వాక్యములో ఉన్న 'విని' హేతువును మాత్రమేకాక కాలమును సైతము సూచిస్తున్నది; గనుక, దానికిన్ని 'కలదు' అనే క్రియకున్ను అన్వయము పొసగదు.

పైని చెప్పిన చిన్నయసూరిగారి వాక్యములు ఇంపుగాను నిర్దుష్టముగాను ఉన్నవంటే, ఈక్రిందివాక్యములు సైతము నిర్దుష్టమైనవని చెప్పవలసివస్తుంది.

"గంగా తీరమున పాటలీ పుత్రమను నగరము సకలసంపదలం గలిగి కలదు." (...పొంది కలదు.)

"కాశిలో జ్ఞానముంగలిగి రామేశ్వరములో ఒక యోగికలడు" (...పొంది కలడు)

"వానికి కుమారులు విశాల నేత్రములం గలిగి కలరు"

"వాడు ఒక కుమారుని ఒక కొమార్తను గలిగి కలడు"

"నేను తోటలోని పండ్లనుజూచి, ఆ పండ్లను దినవలెనను కోరిక నాపు గలను."

"నేనొక పుస్తకముం గలిగి దానిని చదువవలెనను కోరిక గలదు."

పైని చూపించిన చిన్నయసూరిగారి వాక్యములో అన్వయశుద్ధి చెడినదని వినోదినీ పత్రికా సంపాదకుల ఆక్షేపమై ఉండును. ఆ ఆక్షేపము సరియైనదని నా అభిప్రాయము.

# స్టార్ కంబైన్సు వారి హరిశ్చంద్రటాకీ

ప్రజ, చాలా రోజులనుంచి యెదురు చూస్తూ వున్న టాకీ యిది. పౌరాణికగాథలలో హరిశ్చంద్రోపాఖ్యానానికి గల శిలామణీపుర దేనికీ లేదు. పైగా, అడవిలోని సింగాలు ఫిలిము తీశాటప్పుడు, సింహం, గుర్రు మంటూ మీదికి రాగా, హరిశ్చంద్ర వేషధారి, జంకి పారిపోకుండా కత్తిదూసి యెదిరించి దాన్నే తరిమివేశా డనీ, అడవి తగులబడిపోవడం వగైరాలు చూపించడానికి చాలా డబ్బు ఖర్చుపెట్టారనీ, యెంతేనా శ్రమపడ్డా రనీ, పత్రికలలో వార్తల మీద వార్తలు ప్రకటించబడిన తరవాత యిది జమాబందీకి వయలు దేరింది.

కాని, తీరా చూస్తే యేమీ లేదు, ఇదివరకు వచ్చిన తెనుగుటాకీలలో దేనికంటేనూ యిది శ్రేష్ఠంగా లేదు. పైగా యిందులో అనేకదోషా లున్నాయి.

ఈ ఫిలిము తయారుచేసిన డైరక్టరు, డబ్బుఖర్చు మార్గాలు తొక్కడానికి చాలా సమర్థుడై వుంటాడు. ఏమీ సందేహం లేదు; కాని కళాజ్ఞానం, సిద్ధాపిన్నా తారతమ్యం—రామరామా! ఇలాంటివి ఆయన కేమీ తెలిసినట్టు లేదు.

ఆఫిలిములోని కొన్ని దారుణదోషా లివీ.

౧ అంతఃపురంలో, చంద్రమతి, హరిశ్చంద్రుని కాళ్ళదగ్గిర కూచుని, ఆదివరకే ప్రారంభించి వున్న పాట పాడుతోంది. బయట యేదో గోల వినపడింది. "ఏమి" టని హరిశ్చంద్రుడు వులిక్కిపడుతూవుండగా గభీమని సత్యకీర్తి లోపలికి వచ్చాడు. ఒక కబురు లేదు. ఒక పిలవు లేదు. అతని రాక దాసీ లేనా సొంతంగా రాజుకెందుకు చెప్పారు కారో? అసలు వాళ్లు మంత్రిని లోపలి కెలా విడిచిపెట్టారో? నాగరాజారావుగా రేనా యీ అమర్యాదపని కెలా సిద్ధపడ్డారో?

౨ రాజు, అడవిలో, వేటనెపుకొని అలసివున్నాడు. మాలెతలు వచ్చారు. వారిలో వొక తెకు తెనుగు రాదు. తెనుగు తెలిసిన మాలెత మాట్లాడి ఆజ్ఞ పుచ్చుకుని హాస్యం చెయ్యకుండా పనికి నుంచోగా, తెనుగురాని మాలెత, నోరు కట్టేసుకుని, ఏదో నృత్యం చేసింది. కాని బహుమానం దగ్గిరకవచ్చేటప్పటికి తెనుగుమాలెత కూడా సిద్ధం. అమాలెత ముత్యాలహారం వద్దనీ, వొక కౌగిలింత యివ్వవలసిం దనీ కోరగా, మంత్రి ఉడిపంతులులాగ వాళ్ళని గదుముతూ కొట్టబోయాడు. చివరికి ఘటులే వాళ్ళని గెంటుకు పోయారు గదా, మంత్రి అలాంటి చిలిపిచేష్టలు చెయ్యడాని కెందుకు పూనుకున్నాడో?

౩ ఆ సందర్భంలోనే రాజొక దిమ్మమీద కూచునివుండగా మంత్రి వెనక వేపున ఆదిమ్మమీదే వొక కాలు వేసుకుని నుంచున్నాడు. మంత్రి, అక్కుంచున్నవాడు హరిశ్చంద్రుడు వీను కాక అద్దంకే గదా అని నిర్లక్ష్యంగా వున్నట్టుంది. అతని మెడకి తన చేతులు చుట్టి పక్కని కూచున్నాడు కాదు నయమే.

౪. అడవి అంటుకుంది. చంద్రమతీ, హరిశ్చంద్రుడూ లోహితుడూ వేసిన గంతులు చూస్తే ఔచిత్యం అనేది అవసరం లేదని నిశ్చయించుకున్నట్టుంది. నక్షత్రకుడు సరేసరి కోతకంటే అన్యాయంగా ప్రవర్తించాడు. పరుగులెత్తి పరుగులెత్తి చివరి కందరూ వొక చక్కనిలో బీటిలో కలుసుకున్నారు. అయితే: అడవి యెందు కంటుందీ? అగ్ని చివరి కేమయిపోయిందీ! తగులబడుతూవున్న చోటినుంచి వారు తప్పించుకుని బయటపడ్డారా యిందుకోసం పచ్చి గడ్డ రెండుకట్టెలు మండిపోయి నుసి అయిపోవడంవల్ల అగ్ని దానంతట అదే చల్లబడిపోయిందా?

న

౫. గుర్రు మంటూ వొక సింహం హరిశ్చంద్రుని వేపుకి వురికింది. హరిశ్చంద్రుడు కత్తి విడిచిపెట్టలేదు. అంతవరకూ నిజమే; కాని వొక్కదూకున వెనక్కి పారిపోయాడు. ఆంధ్రపత్రికలోని వార్త చూసి యీఘట్టంకోసం కనిపెట్టుకునివున్నవారంతా యేమనాలో అది అన్నారు. ఏమీ తరవాయి పంచలేను.

౬. చంద్రమతీ, లోహితుడూ, నక్షత్రకుడూ నిద్రపోతున్నారు. ఏవో గాండ్రింపులు వినవచ్చాయి. హరిశ్చంద్రుడు లేచివెళ్ళాడు. చంద్రమతీ, లోహితుడూ, నక్షత్రకుడూ వున్నభాగం మసకబడిపోయింది. తరవాత వొక భూతం వచ్చింది. ఒడ్డూ, పొడుగూ, వేషమూ, కంఠమూ భూతానికి తగినట్టే వున్నాయి. భూతానికి యిరవై ముప్ఫయి గజాలదూరంలో, కొంచెం కిందుగా హరిశ్చంద్రుడు నుంచున్నాడు. భూతంపట్టుకు భూతమూ, హరిశ్చంద్రుడుపట్టుకు రాజూ కత్తులు తిప్పారు. ఒకరికత్తి వొకరికి గాని, ఎవరికత్తి వారికి గాని తగలలేదు; కాని భూతం మాత్రం నిగ్గలుపెడుతూ నిద్ర వచ్చి పడుకున్నట్టు నేలమీద వాలింది. వెంటనే అలాంటిదే మరో భూతం వచ్చి అలాగే చేసింది. ఈభాగోతం యెందుకూ?

౭. అడవి దాటి హరిశ్చంద్రుడు తనవారితో మహారాష్ట్రదేశంలోని వొక పల్లెటూరి చెరువుగట్టు చేరాడు. ఆవూరు కాశీ అనీ, ఆచెరువు గంగ అనీ విని, పొలంచాలు నగి ఆనందంగా చెరువులో కాళ్ళు కడుక్కున్నారు. అంతే. నక్షత్రకుడు అక్కడే అపస్వరాలతోటీ, అసందర్భాలతోటీ సంధ్యావందనం చెయ్యబోయాడు. ఆతను సంధ్యావందనం చేశాటప్పుడు చెరువులోని పాచితెట్లు నక్షత్రకుని కాళ్ళదగ్గర స్పష్టంగా కనపడుతున్నాయి. పైగా వాటిలో వొక్కడున్నూ అందులో నదీస్నానం చెయ్యలేదు: కాని హరిశ్చంద్రుడు, పుణ్యమాయించి "గంగాస్నానం అయింది కదా, యిక విశ్వేశ్వరదర్శనం చెయ్యవద్దా" అన్నాడు. మంచి సంగతే దొరికింది డైరక్టరుకి. కాని విశ్వేశ్వరుడు మాత్రం దొరకలేదు.

౮. కాలకౌశికుడు దేవతార్చన చేస్తూవుండగా గుర్రుపెట్టి నిద్రిస్తూ వున్న కలహకంఠి లేచి, "నాఫలహారంయేదీ" అంటూ ముందుకి వచ్చి కూలబడింది. అక్కడి పక్కన అసందర్భం లలా వుందనిద్దాం. అది ప్రాతఃకాలమా మధ్యాహ్నమా? ప్రాతఃకాలమయితే కలహకంఠి సంధ్యావందనం చెయ్యకుండా ఫలహారానికి కూచున్నదనాలి. మధ్యాహ్నమయితే: కలహకంఠి భోజనం చేసి పడుకుని, ఫలహారం వేళకి లేచాటప్పటికి కాలకౌశికుడు దేవతార్చన చేస్తున్నాడనాలి. ఎటయినా అసందర్భమే. కాని డైరక్టరుకి ఇదేమీ తోచలేదు.

౯. వీరబాహువు కల్లుకుండ బుజానపెట్టుకుని పాడుకుంటూ వచ్చాడు. వెయ్యి కాసుల బంగారం యిచ్చి హరిశ్చంద్రుని కొన్నవాడితను. అంతటి ఐశ్వర్యవంతుడు స్వయంగా కల్లుకుండ తెచ్చుకోవలసిందేనా?

౧౦. హరిశ్చంద్రుడు చంద్రమతిని నరకబోతున్నాడు, విశ్వామిత్రుడు వచ్చి "రాజా! నేనే వోడిపోయాను. గెలుపు నీదే. నీభార్యను నరకవద్దు" అన్నాడు. నేనే వోడిపోయానంటే? హరిశ్చంద్రుడికీ, విశ్వామిత్రుడికీ యేమీ పందేలు జరగలేదే?

౧౧. ఈశ్వరుడు సాక్షాత్కరించాడు. "నీసత్యసంధతకు మెచ్చాను. నీభార్యను నరుకొ"ద్దన్నాడు. కాశీరాజపుత్రుణ్ణి మళ్లీ బతికించకుండా చంద్రమతికి శిక్ష యెలా తప్పించగలడూ యీశ్వరుడయితే మాత్రం? ఈశ్వరుడు లెమ్మనగా లోహితుడు లేచి తల్లికీ తండ్రికీ, ఈశ్వరుడికీ నమస్కరించాడు. మంగళసూత్రం సంగతి వచ్చేదాకా చంద్రమతి గుర్తించలేని హరిశ్చంద్రుణ్ణి లేచీలేవడంతోటే లోహితు డెలా గుర్తించాడూ?

మొత్తంమీద ఫిలిమంతా యిలాగే అవకతవకలుగా వుంది; కాని ప్రజ విరుచుకు పడిపోతోంది.

ప్రజకీ కళ అక్కరలేదు. డైరక్టరుకీ కళ అక్కరలేదు. నటులకూ కళ అక్కరలేదు. ఇక ఆంధ్రజాతా? అది మేలుకునివుంటే కాదూ? —చూసినవాడు

# గ్రంథస్వీకారము

## ఆంధ్రదశరూపకము

గ్రంథకర్త ఆంధ్రవిశ్వకళాపరిషత్కళాశాలలో సంస్కృతాంధ్రపండితులుగా వున్న మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు. ప్రకాశకులు మద్రాసు, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండుసన్సువారు. పేజీలు ౧౬+౧౨౫. వెల ౧–౮–౦. ఇది రెండో కూర్పు.

ధనంజయమహాకవి దశరూపకానికిది తెనుగుసేత. సూత్రాత్మకంగా వుంది. వార్తికమూ, ఉదాహరణలూ వున్నాయి.

ఆంధ్రపండితులూ, కవులూ ముఖ్యంగా నాటకకర్తలయితేనూ యిది విధిగా చదవవలసిన గ్రంథమిది. దేశకాలాలను బట్టి నాటకాల ప్రాశస్త్యం తెలుసుకోవడం చాలా అవసరం.

ఆధునికాంధ్రవాఙ్మయాని కిదొక గొప్ప అలంకారం.

అయితే; శైలి సులభంగానూ, వార్తికం యింకా విపులంగానూ వుంటే చాలా బాగుండేది. మూడో కూర్పులోనైనా, శాస్త్రులవారు, స్వయంకృషి చేసుకునేవారి కుపయోగకరంగా వుండేటట్లు సంస్కరిస్తారని నమ్ముతున్నాము.

# విరాళాలు

ఏలేశ్వరపు కృష్ణమూర్తిగారు బి. ఏ. బి. ఎల్. అడ్వకేటు వెల్లూరు ౫–౦–౦

విశేషచందాలిచ్చి ప్రబుద్ధాంధ్రను సత్కరించినవారు

౧ పోట్నూరి స్వామిబాబుగారు లాండులార్డు నరసన్నపేట ౩–౦–౦

౨ మోచర్ల సీతారామయ్యపంతులుగారు బి. ఏ. బి. ఎల్. వకీలు బరంపురం ౨–౦–౦

౩ ఒక పండితమిత్రుడు బరంపురం ౨–౦–౦

౪ డాక్టరు ములుపూరి రంగయ్యచౌదరిగారు ఏలూరు ౨–౦–౦

# వ్యాఖ్యానములు

## కొత్త సంవత్సరం

ఈ సంచికతో ప్రబుద్ధాంధ్రపత్రికకు కొత్త సంవత్సరం ప్రారంభం అయింది.

మళ్లీ ప్రారంభించాక, యీ పత్రిక, యిప్పటికి నిర్విఘ్నంగానూ నిరాఘాటంగానూ రెండేళ్లు ప్రవర్తించింది.

ప్రబుద్ధాంధ్ర ఆవశ్యకాన్ని జాతి పూర్తిగా గుర్తించింది.

ఆంధ్రత్వాన్ని స్థాపనచేసుకోవాలనే ఆవేశం మనలో మళ్లీ యిప్పుడిప్పుడే పొటమరిస్తోంది. నలుమొగాలా చెదరిపోయి వున్న— ఇతర్ల అభ్యుదయానికి వినియోగపడుతూ వున్న మన శక్తియుక్తులన్నీ మళ్లీ అంతర్ముఖాలవుతున్నాయి.

మనది ఆంధ్రత్వం మొదలూ భారతీయత్వం తర్వాతానూ. మనలో ఆంధ్రజాతీయత సమృద్ధిగా ఏర్పడినప్పుడే భారతజాతీయత స్ఫుటంగా ఆవిష్కారం అవుతుంది.

ఆంధ్రత్వం తక్కువైతే అంటే మనకు భారతీయత్వం సంకుచించినట్టే సంక్రమించాను.

అసలు, భిన్నప్రాంతాల జాతులన్నీ వొకచోట కూడినప్పుడే భారతీయత మూర్తిమంతం అవుతుంది. అంతేగాని భారతీయత స్వయంభువు కానే కాదు.

ప్రబుద్ధాంధ్ర విశ్వాసం యిది. దీనికి ప్రాతికూల్యం వస్తే ప్రబుద్ధాంధ్ర ప్రతిఘటిస్తుంది. దీనికి పోటీ రానంతసేపూ భారతజాతీయత విషయంలో ప్రబుద్ధాంధ్రకేమీ పేచీ లేదు.

మనం వొక పూలదండ గుచ్చాలంటే, సమంగా వికసించిన పూవులనే సమకూర్చుకుంటాము. గుడ్డిపువ్వులను విసరిపారేస్తాము. అలాగే భారతజాతీయత సర్వాంగసుందరంగా వుండాలంటే ప్రాంతీయజాతులు సమంగా వికసించినప్పుడే అది సాధ్యపడుతుంది.

ఇప్పుడు భారతజాతీయతలో ఆంధ్రజాతికి స్థలం లేదు. కారణం, యెక్కువగా, ఆంధ్రుని అలసభావం. తక్కువభాగం ఇతర్ల స్వార్థపరత్వం.

అలసభావం అంటే ఆత్మప్రత్యయం లేకపోవడమే. అది లేనందుకు యిప్పటి ఆంధ్రునకు విచారం లేదు. పైగా అది అక్కరలేదనీ, అది అపాయకరమనీ నిశ్చయం కూడానూ.

ఇందువల్లే ఆత్మాభిమానం గిడసబారిన యితర్ల అంకరయొకటూ ఆంధ్రుడు అనుచరుడుగా—భృత్యుడుగా వంగివంగి సలాములు చేస్తూ పక్కపక్కగా ఓసరిల్లి తిరుగుతున్నాడు.

ఇది మనకు సిగ్గుచేటు.

మనజాతి నేటిది కాదు.

మనజాతికి దృఢమైన పునాది వుంది. గొప్ప పూర్వచరిత్ర వుంది. మహోన్నతమైన నాగరికత వుంది.

ప్రపంచంలో ఆంధ్రజాతి లేకపోయివుంటే భారతజాతికి ఇంత ఔజ్వల్యమే లేకపోయివుండును.

ఇప్పుడు కూడా భారతజాతీయతకు ఆంధ్రజాతీయత అంత ప్రధానం కావాలి.

ప్రబుద్ధాంధ్ర ప్రాప్యం యిదీ.

ఇందుకోసమే, ప్రబుద్ధాంధ్ర, హిందీ దురాక్రమణాన్ని ప్రతిఘటిస్తోంది. ఇందుకోసమే, ప్రబుద్ధాంధ్ర, కాంగ్రెస్సుకంటే మనకు ఆంధ్రమహాసభ చాలా ముఖ్యం అంటోంది.

దేశీయులు ఈ రెండేళ్లూ ప్రబుద్ధాంధ్రను పోషించారు; కాని ఆపోషణం చాలలేదు. చేతిసొమ్ము చాలా పడింది. ఆయాసం వచ్చింది. సరస్వతీపవనముద్రాక్షరశాల అధిపతులు శ్రీఅద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారూ, కొన్నితాల వర్తకులు మెస్సర్సు మాదేటి సన్యాసయ్య అండు సన్సువారూ అభిమానించుకోకపోతే ప్రబుద్ధాంధ్ర యింత సక్రమంగా ప్రకటించబడక పోయివుండును.

ఇంతవరకూ ధనమూ రచనలూ చిత్రాలూ యిచ్చి మాకు సాయం చేసినవారికి చాలాచాలా నమస్కారాలు. ఈ కొత్త సంవత్సరం ప్రారంభం కాగానే వారిలో కొందరు మళ్లీ చేయూత యిచ్చారు. ఆజాబితా వేరొకచోట ప్రకటించబడివుంది.

తక్కినవారు కూడా తమ చేయూత మళ్లీ అందిస్తారనీ, కొత్తవారు కూడా మరికొందరు ప్రబుద్ధాంధ్ర పోషణకు పూనుకుంటారనీ లక్ష్మణస్వామినాయుడుగారూ, మాదేటి సన్యాసయ్య అండు సన్సువారూ, యథాపూర్వంగానే మళ్లీ ఆదుకుంటారనీ ఆశిస్తున్నాము.

## వావిళ్లవారు అరవలా ?

ప్రజామిత్రపత్రికలో (౨౯-౧౨-౫౮) శ్రీనివాసశిరోమణిగారిలా రాశారు.

"అసలు ఇదంతా ఎందుకు, రెండుకోట్ల డెబ్భైలక్షల ఆంధ్రులకు పుస్తకాలు ప్రకటించడానికి ఒక్క తెనుగువాడి దుకాణం లేదు. ఈవిషయం ఏతెనుగువాడయినా ఎప్పుడయినా గమనించాడా ? ఇంత తెలుగుదేశానికీ, ఇంతమంది తెలుగువాళ్లకూ పుస్తకప్రకాశకులు వావిళ్ళ రామశాస్త్రులూ అండుసన్సు. ఆ ఒక్కరూ తెనుగువారు కారు, అచ్చమయిన తమిళులు అని "భారతి" పత్రిక ౧౯౩౩ వ సంవత్సరం డిసెంబరు సంచికలో సంపాదకుడు వ్రాశాడు"

భారతి సంపాదకులు ఇలా రాశారు.

"విలుప్తము కానున్న ఆంధ్రుల వాఙ్మయసంపదను ఇట్లు కాపాడుచున్న వావిళ్ళవారు ఆంధ్రులు కారు; ద్రావిడులు. వారు మాటా

దునది అరవము. వారు వ్యవహారమునకు మాత్ర మాంధ్రము నుపయోగింతురు. వారు ఆంధ్రుల వాఙ్మయమునకు చిరంజీవితను కల్పించిన మహోదారులు. ఆంధ్రుల నంటబెట్టుకొనియున్న పరాశ్రయదోషమునకు ఇదియు నొక గొప్ప నిదర్శనము"

వావిళ్ళవారూ, నేలటూరివారూ, వేదంవారూ, చదలవాడవారూ, దండిగుంటవారూ, పురాణంవారూ (ఈయింటిపేరు వెల్నాటివారిలో కూడా వుంది) అల్లాడివారూ మామిడివారూ—ఈ మొదలయినవారు పుదూరుద్రావిడులు.

పుదూరుద్రావిడుల సంఖ్య వేలమీద మాత్రమే వుంది.

అంత చిన్న తెగవారిని ఆంధ్రు లని చెప్పకపోతే ఆంధ్రజాతికి వచ్చిన నష్ట మేమీ లేదు.

కాని వారందరూ ఆంధ్రులు. ఏమీ సందేహం లేదు.

వారు ఆంధ్రుల మని చెప్పుకుంటున్నారు. ఆంధ్రుల మని గర్విస్తున్నారు.

పైగా, అరవలు పుదూరువారిని ఆంధ్రులుగానే పరిగణిస్తున్నారు.

నెల్లూరు మొదలు మద్రాసువరకూ దక్షిణపట్నాలలో ఆంధ్రభాషకు పట్టుగొమ్మలై నిలిచినవారిలో అధిక సంఖ్యాకులు పుదూరువారు.

తెనుగులో మొదట వచనరచన ప్రారంభించినవారు చదలవాడ సీతారామశాస్త్రిగారు. మాక్మిలన్ కంపెనీవారు ప్రకటిస్తూ వున్న మాస్డన్ దొరగారి వాచకాలను తెనుగులోకి మార్చినవారున్నూ సీతారామశాస్త్రిగారే. వీరేశలింగంపంతులుగారు తమ పేరు మాత్రమే యిచ్చారు; గాని తెనిగించలేదు. శబ్దరత్నాకరం తయారు చేసినవారు చదలవాడ సీతారామశాస్త్రిగారే గాని బహుజనపల్లి సీతారామాచార్యులుగారు కారు. ఆచార్యులుగారు శాస్త్రిగారికి అసిస్టెంటుగా వుండేవారు. శాస్త్రిగారు, పని చేసినంతసేపూ చేసి ఇంటికి వెళ్లిపోయేటప్పుడు శబ్దరత్నాకరమును ఆఫీసులోనే పెట్టెలో వుంచేవారు. అది పూర్తి అయిన కొద్దిరోజులకు, వారు, హఠాత్తుగా కాలంచేశారు.

సీతారామాచార్యులుగారు ప్రూఫులు చాలా చక్కగా దిద్దేవారు. వారు తాతవిల్లి ముఠాదారు శేషగిరి శాస్త్రిలవారికి ప్రూఫురీడరుగా వుండేవారు.

చదలవాడ సీతారామశాస్త్రిగారి జీవితం అంతా ఆంధ్రభాషా సేవలోనే గడిచింది. అరవంలో వారేమీ పని చెయ్యలేదు. చదలవాడ సుందరరామశాస్త్రిగారూ, దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారూ, పురాణం హయగ్రీవశాస్త్రిగారూ మొదలయినవారు కూడా తమ జీవితాలను ఆంధ్రభాషాసేవలోనే వినియోగించారు: గాని అరవంలో కించిత్తయినా పని చెయ్యలేదు.

వేదం వేంకటరాయశాస్త్రిగారి వైదుష్యం అంతా ఆంధ్రభాషకే వినియోగపడింది. వావిళ్ల రామస్వామిశాస్త్రిలవారి శక్తియుక్తులన్నీ ఆంధ్రవాఙ్మయచిరంజీవితకే వినియోగపడ్డాయి. వారు కూడా అరవంకేసి చూడనే లేదు.

అరవబ్రాహ్మల అనేకమంది తెనుగుదేశంలో స్థిరపడ్డారు. వారిలో మొదట వచ్చినవారు కోనసీమద్రావిడులూ ఆరామద్రావిడులూను. వీరిద్దరూ అరవం పూర్తిగా మరిచిపోయారు. శుద్ధాంధ్రులుగానే వ్యవహరించుకుంటున్నారు. అయితే: ఆరామద్రావిడులు తెనుగు ఆచారాలూ, సంప్రదాయాలూ పూర్తిగా అవలంబించి వున్నారు; గాని కోనసీమద్రావిడులు కర్మకలాపంవిషయంలో ద్రావిడసంప్రదాయమే అవలంబిస్తున్నారు.

తరవాత తెనుగుదేశానికి వచ్చిన అరవబ్రాహ్మలే తుమ్మగుంట ద్రావిడులు. వీరుకూడా అరవం పూర్తిగా మరిచిపోయారు. భారతి సంపాదకులు ఈ తెగకు చెందినవారే. వీరిని కూడా సర్కారుల ఆంధ్రయుకులు చాలామంది అరవవారనే చెబుతూవుంటారు.

పుదూరుద్రావిళ్లని వ్యవహరించబడుతూ వస్తున్నవారు యిటీవల తెనుగుదేశానికి వచ్చిన అరవబ్రాహ్మలు. వారు వచ్చి యెంతో కాలం కాకపోయినప్పటికీ, ఆ దేశంతో అనుబంధిస్తున్న నెల్లూరు జిల్లాలో స్థిరపడివుండటంవల్ల వారిలో ఇంట్లో అరవం మాట్లాడు కోవడం ఎక్కువ చేసింది. మద్రాసు సంబంధం లేకుండా నెల్లూరు జిల్లాలోనే వుంటూవున్న పుదూరుద్రావిడులు నెల్లూరుజిల్లా ఆంధ్రులలాగే శుద్ధాంధ్రులుగా వున్నారు. వారిలో చాలామంది అరవం మరిచిపోయారు.

వేదం వేంకటరాయశాస్త్రిగారికి తెలుగు, అరవం, సంస్కృతం, ఇంగ్లీషుభాషలలో సమానమైన పాండిత్యం వుంది. అయినా వారు పరిశ్రమ అంతా తెనుగులోనే చేశారు. తమ శక్తి అంతా తెనుగు భాషకే ధారపోశారు. అరవం అంటే వారికి చాలా చిరాకుగా వుండేది.

వావిళ్లవారు పుస్తకవ్యాపారం చేస్తున్నారు. రామస్వామిశాస్త్రిగారు తెనుగుభాషకు చాలా సేవ చేశారు. వారు గొప్ప ఆంధ్రపండితులు. అనేకాంధ్ర గ్రంథాలకు టీకలు రాశారు. ఆంధ్రగ్రంథ ప్రకటన మొదట ప్రారంభించినవారే. తెనుగులిపికి ఇంగ్లీషుబాడీ, అని పిలవబడే చిన్న అక్షరాలను (ఈవ్యాసం కూర్చబడ్డఅక్షరాలను) తయారు చేయించినవారు రామస్వామిశాస్త్రిలవారే. నేటికీ వారి సంస్థ తెనుగుసంస్థలలో అద్వితీయంగా వుంది. అరవానికీ, తెనుగుకీ కూడా యిప్పటికీ మద్రాసే వర్తకస్థానంగా వుంది. ఇలాంటి సందర్భంలో వావిళ్లవారు తెనుగువాఙ్మయ ప్రకటనకు మాత్రమే యెందుకు పూనుకోవలసి వచ్చిందీ? తెనుగు పుస్తకాలతో పాటు, వారు, అరవ పుస్తకాలు కూడా ఎందుకు ప్రకటించడం లేదు!

పోనీ, ఆంధ్రులు రెండుకోట్ల డెబ్భైలక్ష లున్నారు కదా, వారిలో వొక్కరైనా ఆంధ్రగ్రంథప్రకటన కెందుకు పూనుకున్నారు కారూ? ప్రారంభం చేసి కొంతవరకూ సాగించిన వేమూరివారు ఎందుకు చాలించుకున్నారూ?

వాదిళ్లవారు 'త్రిలింగ' అనే పేరితో ఆంధ్రములోనూ, 'ఫెడరేటెడ్ ఇండియా' అనే పేరితో ఇంగ్లీషులోనూ మాత్రమే వార పత్రికలు నడుపుతున్నారు. అరవపత్రికలకు ప్రచారం అధికంగా వుండడమూ, లాభం కూడా వస్తూవుండడమూ తెలిసివుండిన్నీ వారు, అరవంలో కూడా పత్రిక ప్రకటించకపోడానికి కారణం యేమిటి?

కొంచెం జాగ్రత్తగా యోచిస్తే పుదూరుద్రావిడులు అరవ లనడం చాలా సాహసం అని తెలుస్తుంది.

నిజానికి వస్తే, తెనుగుదేశంలో వున్న కౌసలనాటి బ్రాహ్మలు అసలు తెనుగువారు కారు. కోసలదేశంనుంచి వచ్చినవారు. వెల్నాటి వారు కూడా విదర్భదేశంనుంచి వచ్చిన మహారాష్ట్రులు కాని అసలు తెనుగుబ్రాహ్మలు కారు. వెల్నాటిశాఖలో నుంచే విడిపోయిన ఆరువేలనియోగిశాఖకు చెందిన శ్రీనివాసశిరోమణిగారు కూడా శుద్ధాంధ్రులు కారు.

పుదూరువారు, తాము ఆంధ్రులమే అని చెప్పుకుంటూ వున్నప్పుడూ, అరవలు వారిని ఆంధ్రులుగానే పరిగణిస్తూ వున్నప్పుడూ, పుదూరుద్రావిడుల శక్తియుక్తు లన్నీ ఆంధ్రభాషా వాఙ్మయాలకే వినియోగపడుతూ వున్నప్పుడూ వారు అరవ లనీ, ఆంధ్రులు కారనీ కేటాయింపు రాతలు రాయడం చాలా అనుచిత మైన పని.

దీనివల్ల స్థిరపడిపోయిన పుదూరుద్రావిడుల ఆంధ్రత్వాని కేమీ చలనం లేదు; గాని ఆంధ్రయువకులలో కొందరి విపరీతపరిస్థితులే వెల్లడిలోకి వస్తాయి. అంతే.

## ౧౧వ ఆంధ్రనాటకకళాపరిషత్సమావేశం

దీన్ని బెజవాడ వారు పిలిచారు. మదరాసువారు నిర్వహించారు.

తెనుగుదేశంలో క్రమం తప్పకుండా సరిగా సంవత్సరానికి జరిగిన సమావేశం యిప్పటిమట్టుకు దీ వొక్కటే కనపడుతోంది.

కాని యేమి లాభమూ?

పరిషత్తు అయిదేళ్ళనుంచి పని చేస్తోంది. పత్రికా ప్రకటన కూడా ప్రారంభించింది; కాని నటులను దిద్దలేకపోయింది. తయారు చేనా చెయ్యలేకపోయింది. రంగస్థలాలను సంస్కరించలేకపోయింది. ప్రజకు నూత్నరుచి పుట్టించలేకపోయింది. టాకీలవిషయం అసలు తల పెట్టనే లేకపోయింది.

నాటకరచనకు మాత్రం కవులకు ప్రోత్సాహం కలిగించింది; గాని ఆసందర్భంలో పరిషత్తు తొక్కిన మార్గం కుమార్గం అయిపోతుంది. తప్పదు.

ప్రకృతం.

ఈ సమావేశాన్ని ప్రారంభించినవారివల్ల గాని, అహ్వానసంఘాధ్యక్షులవల్ల గాని, అధ్యక్షులవల్ల గాని పరిషత్తున కేమీ విశిష్టత యేర్పడలేదు. ప్రతినిధుల సంగతి కూడా అలాగే వుంది. ఇక ప్రదర్శించిన నాటకాలా? అవి యేనాడో మూలపడిపోయినవి. మళ్లీ పైకి తియ్యరానివి. వాటిలో రసం లేదు. కళ లేదు.

నటులు ఏది ప్రదర్శిస్తా మంటే దానికే అవకాశం కలిగించడం పరిషత్తుకు గౌరవం కలిగించదు.

పైగా ఈ ఆంధ్రనాటకకళాపరిషత్తు హిందీనాటకాలను ప్రదర్శించడం నిజంగా గర్హించతగింది. ఆనటులు అంత గొప్పవారా? హిందీనాటకాలను ప్రదర్శించడంవల్లనే వారు గొప్పవా రైనారా? వారు ప్రదర్శించిన నాటకం అనువాదం కాని స్వతంత్రం కాదే! అది తెనుగులో కూడా వుంది కదా, తెనుగు అనువాదాన్నే ఆనటులు—కారు పరిషత్తు ప్రదర్శనం చేయించకూడదూ?

ఆంధ్రనాటకకళాపరిషత్తు హిందీప్రచారానికి వినియోగపడడం ఆత్మహత్య. అధ్యక్షుల వుపన్యాసాన్ని బట్టి ఈ హిందీప్రదర్శనాలకు వారే ప్రోత్సాహకులుగా కనపడుతున్నారు. వారు తమ కాంగ్రెస్సుభక్తిని ఆంధ్రనాటకకళాపరిషత్తులోకి కూడా దిగుమతీ చెయ్యడం తమకూ పరిషత్తుకూ కూడా అప్రశస్త మైన పని.

నిరుడే ప్రదర్శనాల సందర్భంలో పరిషత్తు చాలా నిందపాలయింది. ఈసంవత్సర మేనా నటులను తయారు చేసి వొక మంచి నాటకాన్ని ప్రదర్శిస్తుం దని ఆశించాము; కాని అది అలా జరగక పోడమే కాకుండా యక్షగానాలకు కూడా యీ సంవత్సరం బహిష్కారం చేసింది. భరతనాట్యం మాట తలపెట్టనే లేదు. అకన్యాశుల్కం యిలా పీలయినంతవరకూ పూర్తిగా సక్రమంగా ప్రదర్శింపచేస్తే బాగుండిపోవును; కాని దాన్ని వొక నాటకానికి సత్రకాయగా చేసింది. కాకిముక్కుకు దొండపండు కట్టింది.

నాలుగో సమావేశం పామరరంజకంగానేనా వుంది. ఈసంవత్సరం అలాగా లేదు. పెద్దనటు లెవ్వరూ యీసంవత్సరం కనపడ లేదు.

కార్యదర్శి నీలంరాజు వెంకటశేషయ్యగారి పరిశ్రమ మేమెరుగుదుము. ఈసంవత్సరం వారు పడిన యిబ్బందులున్నూ మేమెరుగుదుము; కాని వారు కొంచెం పెద్దయెత్తులు వెయ్యాలి. సాగకపోతే పరిషత్తునే నిలిపివెయ్యవచ్చు; గాని యిలా నడపడంవల్ల కష్టమూ, నష్టమూనే గాని సుఖమూ లాభమూ కలగవు.

పరిషత్తు ఇంతకంటే చక్కగా జరగడాని కవకాశాలు లేవని మేము నిరుత్సాహపడము. పూనుకుంటే యింతకంటే యెన్నో రెట్లు బాగుచెయ్యవచ్చు. అయితే మొగమాటాలూ, దాక్షిణ్యాలూ మట్టుకు దూరంగా వుంచాలి. గుణమే ప్రధానంగా యెంచుకోవాలి.

పరిషత్తు తుక్కునాటకాల కవకాశం యిచ్చినంతకాలమూ దేశీయులు కళనే ప్రధానంగా చూడరు. పరిషత్తుకు ఫాయిదా కూడా యేర్పడదు.

ఆంధ్రసాహిత్య పరిషత్తులాగే యీ ఆంధ్రనాటక కళాపరిషత్తు కూడా అపమార్గంలోనే వుండడం చాలా విచారకరంగా వుంది.

ఎందుకూ—?

మా ప్రశ్న కొందరి కిప్పుడు వికటంగానే కనపడవచ్చు; కాని తొందరపడవద్దు. కాంగ్రెస్సులో, శ్రీనివాసఅయ్యంగారి పునఃప్రవేశంతో మన ఆంధ్రులకు తల దిమ్మెక్కే దెబ్బ తగులుతుంది, చూస్తూ వుండండి.

## కోలవెన్ను రామకోటీశ్వరరావు పంతులుగారు

తాము, ప్రజామిత్రపత్రికలో ప్రకటించిన వ్యాసాన్ని పురస్కరించుకుని మేము (అక్టోబరు సంచికలో) చేసిన వ్యాఖ్యానం చూసి శ్రీరామకోటీశ్వరరావు పంతులుగారు చాలా ఖేదపడినట్లు తెలిసింది.

మన ఆంధ్రులలో అసహాయశూరులెవరైనా వున్నా రంటే వారు రామకోటీశ్వరరావు పంతులుగారొక్కరే. త్రివేణిపత్రికను సంపాదించడంలో వారు చూపిస్తూవున్న పాండిత్యమూ, అనుభవిస్తూవున్న కష్టాలూ కూడా అసాధారణాలుగానే వున్నాయి.

ఆంధ్రవికాసమే ప్రధానంగా గల ప్రబుద్ధాంధ్రకు పంతులుగారికంటే పూజ్యులు మరొకరు లేరు.

త్రివేణినిధిని సమకూర్చడానికి చెయ్యబడుతూవున్న ప్రయత్నాలలో, వెనకటి విన్నపంలో వున్న సంతకాలే యిప్పటి విన్నపంలో వున్నవని భ్రమించి మేము ఆవ్యాఖ్యానంలో అలా రాయడం తటస్థించింది.

మా ఆరోపణ భ్రమప్రమాదజనితం కాని ప్రయత్నపూర్వకం కాదు.

శ్రీరామకోటీశ్వరరావుపంతులుగారికి మాపొరపాటు విన్నవించుకుంటూ క్షమించవలసిందని కోరుతున్నాము.

# హిందీవల్ల తెనుక్కి జరుగుతూవున్న అపకారం

డిసెంబరు ౨౫ వ తేదీని మద్రాసు గోఖలేహాలులో జరిగిన దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి పంచమవార్షిక పట్టప్రదానమహోత్సవసభను ఉపన్యసిస్తూ మన నాగేశ్వరరావు పంతులుగారు, "ఇంగ్లీషు విద్యార్థులకొనుసందు ఈ దేశములో ప్రభుత్వమువారు విద్యార్థి వేతనముల నిచ్చి ప్రోత్సహింపవలసిన అవసరము కలిగియుండెను. హిందీకి విశ్వవిద్యాలయము కట్టి ప్రోత్సాహించు అవసరము లేకయే వర్ధిల గలదు. స్త్రీపురుషులు విద్యనభ్యసించుచున్నారు" అని సెలవిచ్చారు. అంటే హిందీభాష అంటే దక్షిణదేశీయులకు అంత అభిమానం వుందని వారి భావం. అయితే, "విద్యార్థులు నేర్చుకోవలసినవి మూడుభాషలు గలవు. మొదటిది మాతృభాష. రెండవది హిందీ భాష. మూడవది ఆంగ్లభాష" అని సెలవిచ్చారే, పంతులుగారు! మొదటిదే అయిన తమ తెనుగుభాష అభ్యసించడానికి విద్యార్థివేతనా లిచ్చినా తెనుగుయువకులు ముందుకు రారనే సంగతి యేమైనా యోచించారా వారు?

* * * * * *

తరవాత పట్టభద్రులకు హితోపదేశం చేస్తూ హిందూస్థానీ లయిన పండితసుందరలాలుగారు "చదువుటకును వ్రాయుటకును దేవనాగరిలిపి అనేకయితరలిపులకంటె యెక్కువ యుపయోగకరముగ నుండును. కాబట్టి మన దేశీయభాషలు కొన్నిటికి గూడ యీలిపి యుపయోగపడవచ్చును" అని సెలవిచ్చారు. దేవనాగరిలిపికంటే ద్రావిడభాషాలిపు లెంత ఉపయోగకరములో, అందులో తెనుగులిపి యెంత సుందరమైనదో—ముక్కూ మొగమూ యేమైనా తెలుసునా సుందరలాలుగారికి? అయితే: వారనాలోచితంగా యీబీజం యిక్కడ వెదజల్లడం లేదు. హిందీద్వారా వారిదివరకే ద్రావిడభాషలకు ఎసరుపెట్టివున్నారు. ఇప్పుడు దేవనాగరిలిపిద్వారా ద్రావిడభాషాలిపులకు కూడా ఎసరుపెడితే ద్రావిడభాష లింకా తొరగా చచ్చిపోతాయి కాదూ?

సుందరలాలుగారంచేతో యీ విషయం కొంచెం తెరమరుగుగా చెప్పారు: కాని స్వామీ సత్యదేవుగారు చాలా స్పష్టంగానే చెప్పారు. డిసెంబరు ౩౦ వ తేదీని తిరువల్లిక్కేణి కల్యాణమంటపములో జరిగిన దక్షిణభారతహిందీప్రచారకుల ఆరవసమావేశంలో వారిలా చెప్పారు. "దక్షిణదేశములో తమిళ, తెలుగు, మలయాళ, కన్నడభాషలకు హిందీలిపి అవలంబించినచో హిందీ సామాన్యభాషగ త్వరగా వ్యాపించగలదు" దక్షిణదేశంలో హిందీ అలుముకుపోవలసినదే. దాని కేది అడ్డువచ్చినా పీకిపారవేయ్యవలసినదే. ఇదే హిందూస్థానీల నిశ్చయం.

దక్షిణదేశీయులకు ఒకప్పుడు ఇంగ్లీషు వ్యామోహం ముదిరిపోయింది. అది యింకా వేళ్లు తన్నుతూనే వుండగా యిప్పుడు ఈ హిందీవ్యామోహం.

దక్షిణదేశంలో భావదాస్యం వడి యింకా తగ్గలేదు.

ఉన్న పుట్టిమునక అంతా యిదీ. సంపాదకుడు

# సరస్వతీగ్రంథమండలి

కంభంవారి సత్రమువీధి ** రాజమహేంద్రవరము

నవలలు—నవరసభరితములగు నవలలు—ముచ్చటగూర్చు బొమ్మలతో—ముద్దులొలుకు క్యాలికో బయిండుతో—రెండుమాసముల కొక్కొక్క—ని నవల. నడుమ నడుమ చిన్నచిన్న అనుబంధగ్రంథములు వెలువడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము రు 0–4–0 చందాదారులు ఒకేసారి రు 7 8-0 ను ముందుగా పంపినచో వరుసగా ఆయాపుస్తకములు అన్ రిజిష్టర్డు పార్సెలుగా పంపుదుము.

## ఇంతవరకు వెలువడిన గ్రంథములు

| | | |
|---|---|---|
| 11 ప్రేమసుందరి | 1 8 0 | |
| 12 చోరశిఖామణి | 1 8 0 | |
| 13 లక్ష్మీప్రసాదము | 1 8 0 | |
| 14 హత్యారహస్యము | 1 8 0 | |
| 15 ఫాస్టు (1 వ భాగము) | 1 8 0 | |
| 16 ఫాస్టు (2 వ భాగము) | 1 8 0 | |
| 17 కుముద్వతి | 1 8 0 | |
| 18 చిన్నకోడలు | 1 8 0 | |
| 19 రహస్యభేదనము | 1 8 0 | |
| 20 సింహగడము | 1 8 0 | |
| 21 మణిహారము | 1 8 0 | |
| 22 మొగలాయీదర్బారు 1 భా॥ | 1 8 0 | |
| 23 ఘటనాచక్రము | 1 8 0 | |
| 24 రాజసుందరి | 1 8 0 | |
| 25 కుంకుమభరణి | 1 8 0 | |
| 26 జాగిలము | 1 8 0 | |
| 27 మొగలాయీదర్బారు 2 భా॥ | 1 8 0 | |
| 28 సరస్వతి | 1 8 0 | |
| 29 ఆనందాభాయి | 1 8 0 | |
| 30 హత్యాన్వేషణము | 1 8 0 | |
| 31 మొగలాయీదర్బారు 3 భా॥ | 1 8 0 | |
| 32 గంగ | 1 8 0 | |
| 33 మొగలాయీదర్బారు 4 భా॥ | 1 8 0 | |
| 34 కోహినూరు | 1 8 0 | |
| 35 ఆటీన్ మహేలా | 1 8 0 | |
| 36 అపరిచిత | 1 8 0 | |
| 37 అంతఃపురము (1 వ భాగము) | 1 8 0 | |
| 38 అంతఃపురము (2 వ భాగము) | 1 8 0 | |
| 39 ఉగ్రహారము | 1 8 0 | |
| 40 ఛిన్నహస్తము (1 వ భాగము) | 1 8 0 | |
| 41 ఛిన్నహస్తము (2 వ భాగము) | 1 8 0 | |
| 42 కింకిణరహస్యము | 1 8 0 | |
| 43 సంజీవి (1 వ భాగము) | 1 8 0 | |
| 44 సంజీవి (2 వ భాగము) | 1 8 0 | |
| 45 వ్రజరాణి | 1 8 0 | |
| 46 హత్యాభ్రమ | 1 8 0 | |
| 47 కౌశిఖండము | 1 8 0 | |
| 48 సేవాశ్రమము (1 వ భాగము) | 1 8 0 | |
| 49 సేవాశ్రమము (2 వ భాగము) | 1 8 0 | |
| 50 దాసీకన్య | 1 8 0 | |

## అనుబంధములు

| | |
|---|---|
| 1 మృత్యురంగిణి | 0 12 0 |
| 2 అభాగిని | 0 12 0 |
| 3 ఛద్మవేషి | 0 12 0 |
| 4 విదురుని యుపదేశములు | 1 0 0 |
| 5 కాంచనమాల | 1 0 0 |
| 6 సీమంతిని | 1 0 0 |
| 7 సుశీల | 1 0 0 |
| 8 శశిరేఖ | 1 0 0 |
| 9 యమునాబాయి | 1 0 0 |
| 10 శ్యామల | 1 0 0 |
| 11 కాంతంకథలు (చిన్నకథలు) | 1 0 0 |
| 12 కాలసర్పి | 1 0 0 |
| 13 భారతకథాసారం | 1 0 0 |
| 14 కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 0 0 |
| 15 అరక్షణీయ | 1 0 0 |
| 16 మాధవి | 1 0 0 |
| 17 లలిత | 1 0 0 |
| 18 పెండ్లిదండ | 1 0 0 |
| 19 కథావళి | 1 0 0 |
| 20 నాలుగుకథలు | 1 0 0 |
| 21 నీతిప్రబోధిక | 1 0 0 |
| 22 అదర్శము (1 వ భాగము) | 0 12 0 |
| 23 ఉదంకుడు | 0 12 0 |
| 24 భేతాళకథలు | 0 12 0 |

## నాటకములు

| | |
|---|---|
| 1 మార్కండేయ | 0 12 0 |
| 2 అహల్యాశాపవిమోచనము | 0 12 0 |
| 3 మిహిరపతనము | 1 0 0 |
| 4 వరమాల | 1 0 0 |
| 5 షాజహాను | 1 0 0 |
| 6 నూర్జహాను | 1 0 0 |
| 7 దుర్గాదాసు | 1 0 0 |
| 8 చంద్రగుప్త | 1 0 0 |
| 9 దంపతులు | 1 0 0 |
| 10 విజయవిజయం | 1 0 0 |
| 11 భక్తతుకారాం | 1 0 0 |

ఈ గ్రంథములు రాజమండ్రిలో [illegible]

**కుంకుమపూవు** :— కాశ్మీరజ - కుంకుమ — Corcus-Salivus. Eng: Saffron.

స్వరూపము — ఇది కాశ్మీర దేశమునందును, హీరాదేశమునందును పుట్టు సుగంధద్రవ్యము. దీని కేసరము లెఱ్ఱగను, కొంచెము తెల్లగను యుండును. రంగు వేయబడిన కుత్రిమ కుంకుమపువ్వు బజారులో గలదు. కుంకుమపువ్వు చేతిలో నలిపిన రఁగంటుకొనక యుండినచో నది, అసలైనదని తెలియవలెను. నీటిలో వేసిన నీరు యెఱ్ఱబడక యుండిన నది శ్రేష్ఠమైనది. అసలైన కుంకుమపూవు కొంచెము చమురుగలిగి యుండును.

గుణములు — ఇది కారము, చేదు, రుచులు గలది. వేడిచేయు స్వభావము గలది. విపాకమున కారపు రుచిగ మారును. లఘుగుణము. వాతకఫములు హరించును. దగ్గులు కట్టును. విషదోషములు శమించును. కంఠరోగములు, తలనొప్పులు పోవును. వీర్యవృద్ధియు ధాతుపుష్టియును గలిగించును. ముక్కు, చెవి, కన్ను, నోరు, శిరస్సు మొదలగు నూర్ధ్వజత్రుగత రోగములను శమింపజేయును.

ప్రయోగము — అశ్మరీ-కృఛ్రములకు :— కుంకుమపూవు ద్రాక్ష రసముతో కలిపి త్రాగిన సర్వ కృచ్రములు, అశ్మరులు శమించును. (చి. 26 అ. చరకము.)

మూత్రరోధజ-ఉదావర్తమునకు:—కుంకుమపూవు కషాయమును లోనికి త్రాగిన ఉదావర్తము తగ్గును.

మూత్రాఘాతమునకు :—కుంకుమపూవు మెత్తగా నూరి నీటిలో కలిపి దానిలో తేనెవేసి రాత్రి నిలువయుంచి ప్రాతఃకాలమున త్రాగిన మూత్రకృఛ్రములు తప్పక శమించును. (59 అ. సుశ్రుతము)

శిరోరోగములకు :—కుంకుమపూవును పంచదారయును గలిపి ఆవునేతితో వేచి నస్యము చేయించి యుపయోగించిన కనుబొమలమధ్యను, కణతలయందును, నేత్రములయందును, చెవులయందును, సూర్యావర్తకమను శూలయు నశించును. (చక్రదత్త)

బొల్లికి :—రేలవేరు నీటిలో నఱగదీసి ఆగంధములో కుంకుమపూవు కలిపి బొల్లికి రాసిన బొల్లులు తగ్గును. ముఖముపై మొటిమలుకూడ తగ్గును.

ప్రసవస్త్రీ మైలరక్తశోధనకు :—రెండు చిన్నముల కుంకుమపూవును 6 మిరియములును కలిపి నీళ్లతో నూరి ప్రసవస్త్రీ కిచ్చిన గర్భశోధన మొనరించి మైలరక్తమును వెడలించును. జ్వరమును కూడ రాకుండ కాపాడును.

నేత్రరోగములకు :— ఇంటుబగింజ గంధములో కుంకుమపూవు కలిపి కంటిచుట్టును పట్టువేసిన కంటివ్యాధులు తగ్గును. మరియు నిమ్మపండ్ల రసములో కరక్కాయ అరగదీసి దానిలో కుంకుమపూవు కలిపి కంటిచుట్టు పట్టువేసిన నేత్రరోగములు తగ్గును.